# శ్రీమద్రామాయణ కల్ప వృక్షము

# శబరి

## [ విజ్ఞాన వ్యాఖ్య ]

ప్రచురణ :

Acc No. 9755




గ్రంథకర్త

డా॥ యస్. టి. వి. రాజగోపాలాచార్యులు

ఎం. ఏ. పి. హెచ్. డి.

తెలుగు ఉపన్యాసకులు

కె. బి. జె. కాలేజి, భీమవరం - 2.

ప్రథమ ముద్రణము : అక్టోబరు, 1990

ప్రతులు : 500

ముఖ చిత్రం : పి. భాస్కర్, భీమవరం

సర్వస్వామ్యములు రచయితవి

మూల్యము : రూ. 15-00

ప్రతులకు :

**శ్రీమతి యస్. టి. రాధ**

ఇం. నెం. 27-17-45, శ్రీనివాస భారతి,

నాగేంద్ర రోడ్, A. S. R. నగర్,

భీమవరం - 534 202. (A. P.)

ముద్రణ :

శ్రీ గౌతమ్ ప్రింటర్స్

భీమవరం-1.

జ్ఞానపీఠ బహుమతి గ్రహీత
కల్పవృక్ష రచయిత, కళాప్రపూర్ణ

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ



కవి సమ్రాడ్బిరుదంబుతో ఋషివచోగాంభీర్య విస్ఫూర్తితో
వివిధ గ్రంథ యశంబుతో రసకళా విజ్ఞాన తేజంబుతో
భువి రామాయణ కల్పవృక్షము సుధీభోగ్యాంధ్రి సారస్వతో
పవనిన్ నాటిన విశ్వనాథ కవి నాహ్వానింతు బద్ధాంజలిన్.

- శ్రీమహాభారత వైజ్ఞానిక సమీక్షా గ్రంథకర్త
కీ॥ శే॥ శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్యులు.

శ్రీవాన్ ఇ. వి. శేషాచార్యులు
శ్రీమతి రాజ్యలక్ష్మి



కం॥ ముద్రా వ్యయ భారమ్మును
ముదిరిత మోదంబు తోడ మోసిన శ్రీ శ్రీ
మద్రాజ్యలక్ష్మి శేషుల
భద్రాత్ములఁ జేయ రామభద్రు భజింతున్॥

- రాజగోపాలాచార్యులు.

# ఈ గ్రంథమును గూర్చి ....

ఉపనిషద్విజ్ఞానము, వేద రహస్యము, సాంఖ్యయోగ రహస్యములు తెలిసిన వారికి గాని శ్రీ రామాయణ భారతములు అంతు పట్టవు. శ్రీ విశ్వనాథ వారు సాధన గలవారు. ద్రష్టలు, జ్ఞానులు, ఉపాసకులు కూడ. కనుక వారి గూఢముగు రామాయణాన్ని సామాన్యులు అర్థం చేసుకోలేరు. శ్రీమాన్ రాజగోపాలాచార్యుల వారు వారి పితృపాదుల కటాక్షంచే ప్రకాశించిన అంతర్దృష్టి కలవారు. కనుక విశ్వనాథ వారి శబరీ రామ సమాగమంలో ఆత్మ పరమాత్మ సమాగమంలో ఉండే సౌందర్యాన్ని, రాసికాన్ని;-జ్ఞానభక్తి వైరాగ్య యోగముల సమ్మేళనముతో సాగిన శబరీ రహస్య తత్త్వాన్ని దర్శించి, అనుభవించి ఆవిష్కరించినారు.

- శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు
విశాఖపట్టణం.

శ్రీమాన్ ఆచార్యుల వారు ప్రతి పదము నందలి విజ్ఞాన నిధిని వెలికి తీసి వన్నె చూపి విశ్వనాథ ప్రజ్ఞాపాటవమును సోపపత్తికమైన, శాస్త్రీయమైన, సైద్ధాంతికమైన, ఆధికారికమైన, ఆనందపరమైన "ద్యులోక దీధితి"తో ప్రకాశింపజేసినారు.

- శ్రీ పేరాల భరత శర్మ
విజయనగరం.

విశ్వనాథ భారతి కడు గభీరము. దాని ఎత్తును చూచినంతగా లోతును చూచిన వారు అరుదు. శ్రీ రాజ గోపాలాచార్యులు గారు శబరి ఘట్టమున లోతులు ముట్టిరి.... ఈ ఘట్టము నందు అభివ్యాప్తమై యున్న విశిష్ట యోగ రహస్యముల నెన్నింటినో వీరు శ్రమపడి సూక్ష్మ దృష్టితో మథించి మనకు అందించిరి. అమ్మమ్మా! ఈ చిన్న పుస్తకమున ఎన్నెన్ని లోతులు! ఎంతెంత లోతులు!!

- ఆచార్య డా॥ బేతవోలు రామబ్రహ్మం
సాహిత్య పీఠాధిపతి, తెలుగు విశ్వవిద్యాలయం

కల్పవృక్ష చ్ఛాయల్లో శబరీ శ్రీరాముల సంభాషణం వేరుగా కన్పిస్తుంది. ఇందులో ఉన్న అంతరార్థం ఏమిటో తెలుసుకోవటం కష్టం. అలాంటి శబరీ ఘట్టాన్ని ఈ రాజ గోపాలాచార్యుల వారు మెల్ల మెల్లగా పసిగట్టి పసిగట్టి వారి నాన్నగారి శిక్షణ చేత తాత్త్వికమైన దృష్టి విశేషం కలవారగుట చేత అనేక విధములైన ప్రమాణాలతో మంచి వ్యాఖ్యానం చేసారు.... ఆ తండ్రీ బిడ్డ కనుక ఈ తాత్త్విక కిశోరం అనన్వితములుగా కనిపించే వాటిని సమన్వితంగా వ్యాఖ్యానిస్తున్నారు గ్రంథ విషయం చాలా గొప్పది.

— శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు
గుంటూరు.

శ్రీమాన్ శ్రీమత్తిరుమల రాజగోపాలాచార్యులుగారు రచించిన 'విశ్వనాథ శబరి-విజ్ఞాన వ్యాఖ్య' గ్రంథమును అవహితుడనై వినుట తటస్థించినది. వీరి అనుశీలన సరణి సమీచీనమై కవి హృదయమును స్పృశింపఁ జాలి యున్నది. పితృప్రాప్తమైన శ్రుత పాథేయము వీరి నైసర్గిక సంపత్తి అని స్ఫురించి నంతనే సర్వమును వీరి యందు సముపపన్నమని తేటపడును. ఇట్టి యనుశీలనముతో మఱి కొన్ని గ్రంథములను రచింప వలెనని ఆశంసించుచున్నాను.

— శ్రీ మల్లంపల్లి శరభయ్య
రాజమండ్రి.

నేను హృద్య పద్య పక్షపాతిని అయినా శ్రీ విశ్వనాథ వారి పద్యం చదవడం నాకు కష్టం అనిపించేది. ఈ శబరి విమర్శ చదివిన తరువాత వారి కల్పవృక్షం మళ్ళీ చదవాలనిపిస్తూంది. ఈ వచన రచన మల్లెల సరం లాగా నన్నెంతో ఆకర్షించింది. సంస్కార పక్వమైన మనస్సుతో శ్రీ విశ్వనాథ వారి శబరిని చదివి, భావించి, ఆ స్వారస్యాన్ని పారమ్యాన్ని లోకానికి అందించిన అదృష్టవంతులు శ్రీ రాజగోపాలాచార్యుల వారు.

— శ్రీ యస్. రాజన్న కవి
ప్రొద్దుటూరు.

నిరాశ లేని అనంత నిరీక్షణలోని మాధుర్య ఫలం శబరి. భగవదర్పితమైన ఒక వైజ్ఞానిక కుసుమం ఆమె. ఆ కుసుమ పరిమళమే ఈ రచన. ఇదొక వైదిక దృష్టి. ఇదొక వైహాయసవీక్షణా సృష్టి. అది విశ్వనాథ వారి జీవుని వేదన- ఇది రాజగోపాలుని ఆత్మ నివేదన.

- శ్రీ ఆచార్య తిరుమల
హైదరాబాద్.

కవి కన్నా విమర్శకుడు గొప్పవాడు. విశ్వనాథ తన శబరి కథలో ఇన్ని ఆధ్యాత్మిక విశేషాలు భావించాడో లేదో కాని ఈ వ్యాస రచయిత భావన చేశారు. శబరి గాథ ఆధారంగా ఎన్నెన్నో ఆధ్యాత్మిక రహస్యాలు వెలువరించారు రచయిత. ఈ పుస్తకం చదవటం ప్రారంభిస్తే చాలు పాఠకునిచే ఆసాంతం చదివిస్తుంది. ఊరక చదివి విడిచి పెట్ట దగిన గ్రంథం కాదిది. ఆలోచనామృతాని కిది ప్రతీక.

- శ్రీ మొవ్వ వృషాద్రిపతి
రేపల్లె.

"రాజగోపాల! నీ రమ్యమౌ శైలియ
తేజోమయంబైన తెలుగు వాణి"

- పద్మశ్రీ డా॥ పి. బి. శ్రీనివాస్
సినీ నేపథ్య గాయకులు, మద్రాస్.

శబరీ నిర్మమ లోచనాంత శయితాచ్ఛ స్వచ్ఛ వైరాగ్యవ
న్నిబిడ జ్యోతి రుదాత్త వీచికలలో నిత్యంబు దోఁగాడు చి
త్ప్రబల వ్యాప్తికి మోదమాన మతియౌ రాముండు
మారాష్ట్రవృ
ష్టిబలో త్కర్షను జానకీ విరహ హృచ్చింతా స్మృతిం
గోలు పో
యె బళారే! యిది యెట్లు ధర్మమగునో యీక్షింపఁగా
నెంచు మీ
యుబలాటుంబును రాజగోప గురుఁడె ట్లోప్పించునో
చూడుఁడీ॥

- శ్రీ తమ్మన వెంకటేశ్వరరావు
డి. యన్. ఆర్. కళాశాల, భీమవరం.

శబరి కబరికి కల్పవృక్ష ప్రసూన
మాలికలు తురిమి శ్రుతి ప్రమాణ దివ్య
పరిమళంబులు కవితా ప్రపంచ మందు
గుప్పు మనిపించె శ్రీ రాజగోప సూరి॥

- శ్రీ వాజపేయ యాజుల కృష్ణమూర్తి
రాజమండ్రి.

ఏ తద్గ్రంథ కర్త చి॥ డాక్టర్ శ్రీమత్తిరుమల వెంకట రాజగోపాలాచార్యులు నాకు ఆత్మీయ ప్రియ శిష్యుడు. అతడీ శబరి కథా సన్నివేశమును ఒక మహాసభలో నా సమక్షమున ప్రసంగించినపుడు నలుగురూ పలువురూ మెచ్చిన వారు. ఆ మెప్పుదల అతనికి ప్రోద్బలకము కాగా ఈ కృతి నిట్లు అంతర్వాణి వరేణ్యుల అంతరంగమునకు ఆహా పుట్టించు నట్లు రూపొందించినాడు.

— ప్రొఫెసర్ యస్. వి. జోగారావు

M.A., Ph. D. (Hon). D. Litt. (A.U. & U.S.A.)

Notional Professor of Telugu,

విశాఖపట్టణం.



# విషయ సూచిక

పుట సంఖ్య

నా మాతృమూర్తి :

# శ్రీమతి సుగుణావతి



## కృతి సమర్పణము

విశ్వనాథ శబరి విజ్ఞాన దీప్తిలోఁ
దత్త్వ 'సుగుణ' వల్లి 'తల్లి'ఁ గంటి
తల్లి కంటె పరమ దైవంబు లేదని
సరస సుకృతి కృతి నొసంగు చుంటి॥

పితృ దేవులు :

# శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్యులు గారు



గురు సంస్మరణము

శ్రీమత్తిర్మల రాఘవార్య హృదయాంభోరాశి రాకావిధుమ్
ప్రజ్ఞానాంబర భాస్కరం శుభకరం వాత్సల్య వారాన్నిధిం
శ్రీమద్భారత గర్భ తత్త్వ విలసద్విజ్ఞాన సంపత్తనిమ్
సేవేఽస్మద్గురులోక రత్న మకుటం శ్రీ శ్రీనివాసం సదా॥

# గ్రంథకర్త విజ్ఞప్తి

"న వాదాన్నాపి సంఘర్షాత్। నాధిక్యాన్నచకామతః
వక్ష్యామి వచనం రాజన్। యథార్థం రామగౌరవాత్"

సువిచక్షణులారా!

శ్రీమద్గురు శ్రీమాన్ శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్య మహోదయ దివ్య కృపా లేశ లబ్ధ విజ్ఞాన స్ఫురణ రూప వ్యాఖ్యాన సరణిలో ఆకృతి దాల్చిన కృతి ఈ "విశ్వనాథ శబరి" సుకృతి.

ఈ వైజ్ఞానిక వాణి_ బాణి గురుపరంపరాగతమే కాని స్వయం ప్రతిభా సముద్భూతము కాదని నా మొదటి మనవి.

ఆ గురు పరంపరలో అవతరించి ఈ విశ్వ విశ్వాతీతా నంత మహా విజ్ఞానానంద భాండాగారాన్ని జాతి కందించుచు వచ్చిన దివ్య జ్ఞానులు_జైపూర్ రాజా ఆస్థాన పండితులు, 'సమీక్షా చక్రవర్తి' శ్రీ మధుసూదన ఓఝా; 'అనుశ్రుత వైజ్ఞానిక' బ్రహ్మశ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రి; శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్షా గ్రంథకర్త, నాకు తండ్రి, దైవము అయిన శ్రీమాన్ శ్రీనివాసాచార్య గురుత్రయ పవిత్ర దివ్య పాదార విందములకు భక్తి ప్రపత్తులతో మనసా 'ప్రథమం వందే.'

నాయీ వ్యాఖ్యానము నందేమైన దొసగులు దొరలినచో అవి నావి. పెద్దల మన్ననలు బడసిన గురుతర భావములు గురులకు చెందినవే.

ప్రస్తుత గ్రంథము : మార్చి 1990లో పెద్దాపురం మహారాణి అటానమస్ కళాశాలలో యు జి. సి. వారు ఏర్పాటు చేసిన శ్రీమద్రామాయణ కల్పవృక్ష జాతీయ సదస్సులో గావించిన ప్రసంగము యొక్క విస్తృత రూపమే యీ గ్రంథము.

ఆ మహా సభలో నాకొక మహావకాశమును కల్పించి నన్ను ప్రోత్సహించి ఈ గ్రంథమిట్లు రూపు దిద్దుకొనుటకు ముఖ్య కారకులైన వారు పరిశోధక పరమేశ్వర బిరుదాంచితులు, ఆదర్శ ఉపాధ్యాయులు, సాహితీ రత్నాకరులు, మద్గురు వరేణ్యులు అంతర్జాతీయచార్య శ్రీ యస్వీ జోగా రావు గారు. వారు నాపై ప్రసరించుచున్న అవ్యాజ కారుణ్యమునకు సదా ఋణపడి యున్నాను.

నాటి సభలో ప్రసంగ విషయముగ ఈ శబరి కథా సన్నివేశమును సూచించి ప్రేరకులై సహకరించిన సాహితీ మిత్రులు డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మగారు. ఆనాడు, ఆ తరువాత నా ప్రసంగ వ్యాసము లాలించి లాలించి మెచ్చి ప్రోత్సహించిన ప్రముఖ సాహితీ వేత్తలు ఆచార్య డా॥ జి వి. సుబ్రహ్మణ్యం, డా॥ యమ్. కులశేఖరరావు, డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి, డా॥ యస్. వి. రామారావు,

డా॥ కరుణశ్రీ, డా॥ ప్రసాదరాయ కులపతి, శ్రీ ములగాల సేతు మాధవస్వామి, శ్రీ S. N. C. రామానుజాచార్య (పెన్నాడ); శ్రీ K. V. అప్పలాచార్య (భీమవరం) సోదరుడు శేషు ప్రభృతు లనేకులు.

నేను కోరిన వెంటనే తమ అమూల్యమైన విద్వదభి ప్రాయము లనుగ్రహించిన విజ్ఞులు, స్వయం దృఢ ప్రజ్ఞులు, పూజ్యులు సర్వశ్రీ శ్రీ భాష్యం అప్పలాచార్య, కోగంటి సీతా రామాచార్య, ఆచార్యయస్వీ జోగారావు, మల్లంపల్లి శరభయ్య బేతవోలు రామబ్రహ్మం, పేరాల భరతశర్మ, ఆచార్య తిరుమల, యస్. రాజన్న కవి, మొవ్వ వృషాద్రిపతి, పి. బి. శ్రీనివాస్, తమ్మన వెంకటేశ్వరరావు, వాజపేయ యాజుల కృష్ణమూర్తి గార్లకు వినయ వినమిత శిరస్కుడనై కృతజ్ఞతా వందనము లర్పించు కొనుచున్నాను. ఈ మహాత్ముల అక్షరాశీస్సులు నా భవిష్య దభ్యుదయ హేతువు కాగలదని ఆనందించు చున్నాను.

**అంకితము :** మా తండ్రిగారి సహధర్మ చారిణియై భారత భాగవత రామాయణములు, అష్టాదశ పురాణాది ఆర్ష గ్రంథములు క్షుణ్ణముగ చదువుటయేగాక గొప్ప తాత్త్విక సంపన్నురాలైన నా మాతృమూర్తి శ్రీమతి సుగుణావతీ దేవి నా చదువు సంస్కారములకు పాడి మొదవు పొదువు. ఒకనాటి వేకువన నా కగుపించిన వైజ్ఞానిక శబరిలో ఆమె దర్శన మీయగా వెంటనే ఈ కృతిని మాతృమూర్తికి సమర్పించి

నా జన్మ ధన్యము గావించు కొనవలెనను సంకల్పము కలిగెను. నా యీ పూజా పుష్పమును ఆమె ప్రేమతో స్వీకరించెను, ధన్యోఽస్మి అనుకొంటిని. జ్ఞాన విజ్ఞాన తేజస్వి, తపస్వి నా తండ్రి. తత్తుల్య నా తల్లి. జన్మాంతర సుకృత విశేషమున అట్టి పుణ్య దంపతులకు జన్మించుట మాత్రమే నాకున్న అర్హత యని భావించుకొనుచు వారికి నా ప్రణామ పూర్వక నిత్య నీరాజనము నర్పించు కొనుచున్నాను.

నా మాతృ మూర్తికి అంకితమగుచున్న ఈ గ్రంథ ముద్రణ మహాధ్వరమున తమ వంతు భక్తిని ప్రకటింపదల చిన నా పెద్దక్క బావలు శ్రీమతి ఈయుణ్ణి రాజ్యలక్ష్మీ వెంకట శేషాచార్యులు (విజయవాడ) పరిచురణ వ్యయ భారమును స్వీకరించిరి. నా మాతా పితలపై వారి భక్తి అట్టిది. వారికి నా కృతజ్ఞతలు.

**చివరిగా :** ఆత్మ విజ్ఞాన దృష్టిగల విశ్వనాథ వంటి మన విద్వాంసుల సువిశాల జ్ఞాన గుణ గౌరవ పావన భావనా తేజః పటిమ ఎంతటిదో కొంతలో కొంత ఈ వ్యాఖ్యానము వలన పాఠకులకు భాసమానమైనచో నా కృషి ఫలవంతమైనట్లే భావింతును.

ఇది యొక వైజ్ఞానిక దృష్టి. ఈ దృష్టితో పరికించి ఆత్మ సాక్షాత్కార ప్రయోజనమును సాధింపుడు.

నాకు సర్వతో సహకరించిన సహృదయులందరకును, మదుపయుక్త గ్రంథ కర్తలకును, విశేషాదరమున విశ్వనాథ వారి ఫోటోను అందించిన వారి కుమారులు శ్రీ పావనిశాస్త్రి గారికిని, ముఖ చిత్రము నలంకరించిన శ్రీ పి. భాస్కర్ గారికి, గౌతమ్ ముద్రణాలయాధిపతులకు, తమ అండదండలు మెండుగ నందించే మా కళాశాలాధ్యక్షులు శ్రీ సాగి వాసుదేవ రాజు గారికిని కృతజ్ఞతాంజలి నివేదించు చున్నాను.

సహృదయ సుధీవతంసులారా!

ఇందరి అండ చూచుకొని ఉప్పొంగిన పారవశ్యముతో ఆనందాశ్రునయనయై 'విశ్వనాథ వారి విజ్ఞాన శబరి' మీ ముందునకు వచ్చు చున్నది. హృదయ కవాటమును తెరచి ఆత్మీయముగ సమాదరింపుడు.

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
శ్రీమత్తిరుమల వెంకట రాజగోపాలాచార్యులు



# ❁ కన్నాకు ❁

సీ॥ అన్నమ్ము తిను నరుండెన్నండు మరువని
చవి గూర్చు "అన్నవిజ్ఞాన" కర్త
అన్నన్న యను రీతి "చిన్నన్న ద్విపదల"
చెన్ను నెన్నిన శోధకోన్నతుండు
భారత విజ్ఞాన సారమౌ జనకుని
గ్రంథ ప్రచురణ ప్రకాశకుండు
క్రమమౌ ఆధ్యాత్మిక శ్రీనివాస భా
రతి యుక్తమౌ వాగ్విలాసమూర్తి
కల్ప వృక్షాన కన్నాకుగా చెలంగు
శబరి విజ్ఞాన ఫల సముచ్చయ రసమ్ము
పంచి పెట్టుచు నుండె సేవించి యిదిగో
రాజగోపాల నామ విభ్రాజ యశుడు॥

డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మ
సంస్కృత కళాశాల, భీమవరం.



ఓమ్
శ్రీరామ చన్ద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమద్రామాయణ కల్ప వృక్షము

# శబరి

కామ్యార్థ ఫలదాయకమైన కల్ప వృక్షమును భువికి అవతరింప జేసిన విశ్వకవి విశ్వనాథ. సత్యనారాయణ భావ రూపమైన ఆ కల్ప వృక్షమున ఒక రసవదమృత ఫలము శబరి వృత్తాంతము.

శబరి కథ : పంపాతీర నివాసిని, మతంగముని శిష్యురాలు అయిన ముదుసలి శబరి ఆశ్రమమునకు రామలక్ష్మణులు వచ్చిరి. శబరి వారికి వన్య ఫలములు సమర్పించి రామచంద్రుని దర్శనము వలన తన జన్మ సార్థకమైనట్లును, తన తపస్సు ఫలించినట్లును భావించి, రాముని దివ్యత్వమును నుతించుచు అగ్ని ప్రవేశము గావించి, దేహమును త్యజించి స్వర్గమును చేరుటయే స్థూలముగ శబరి వృత్తాంతము. ఇది అరణ్య కాండాంతమునందలిది.

విశ్వనాథ వినూత్న రీతి : ఎందరో కవుల కలాలను పండించిన భక్త శబరి కథ విశ్వనాథ లేఖినిలో వినూత్న

రీతిని ఉజ్జ్వలమై ప్రకాశించినది. సూక్ష్మేక్షణమున పరిశీలించిన గాని విశ్వనాథ వైశిష్ట్యము వెల్లడి కాదు. పరిశీలింతము.

ఎవరో 'రామా!' యని పిలచుచున్నారు. ఆ పిలుపు 'పంపా తరంగిణీ తట హంసీ నవగరు దాహతి పుష్టమైన నవానిల తరంగము' తో కలసి రాముని స్పృశించెను. నవానిల మనుటలోనే కథాంతర్గత నవత్వ స్ఫూర్తి కలదు. ఈ నవానిలము కల్పవృక్ష సంబంధి కూడా. అన్ని కథల తీరు వేరు ఈ శబరి కథ తీరు వేరు అని చెప్పుటకే నవానిల మనుట. ఇది శబరి కథకు గల ప్రత్యేక స్థానమును కూడ సూచించును. మరి గాలికి క్రొత్త ప్రాతల భేదముండునా ? ఇది క్రొత్త గాలి ఎట్లయినది? అనగా ఆ క్షణమున పంపా నదిపై నుండి వీచిన గాలి యగుటచే కాదు, ఆ నది యొడ్డున నున్న ఒక ఆడు హంస ఱెక్కల దెబ్బలచే పుష్టమైన దగుటచే అది నవానిల మైనది. ఆ హంసి యొక్క జ్ఞాన-కర్మలనబడు ఱెక్కల తాకిడితో పుష్టమై బయలు దేరిన ఒకానొక ప్రాణ వాయు విశేషము రామచంద్రుని స్పృశించి రాముని ఆత్మలో జేరి నవతేజమును సంతరించుకో నున్నదని సూచించు అనిలము కనుక అది నవానిలమైనదని సమాధానము. దీనిని బట్టి తక్కిన రామాయణములందువలె కాక తానీ శబరి కథను క్రొత్త పద్ధతిని రచించుచున్నట్లు కవి సూచనము.

హంసీ - శబరి : ఇట్లు కథారంభమున కవి ఒక హంసను ప్రవేశ పెట్టెను. ఇది ఆడు హంస కనుక 'హంసీ' శబ్దమును ప్రయోగించెను. ఇటు స్త్రీ లింగమైన హంసీ శబ్దము స్త్రీ కంఠమును ధ్వనింప జేయు చున్నది. రామా! అనుచు పిలచినది మరెవరో కాదు శబరియే. ఆ జ్ఞాన - కర్మలు మరెవరివో కాదు శబరివే. శ్రీరామచంద్రుని ఆత్మలో జేరి నవ తేజమును సంతరించుకోనున్న ప్రాణానిల మింకెవరిదో కాదు శబరిదే. మరియు ఒకానొక 'యోగి' విశేషమును 'హంస' యందురు, 'శ్రీరామకృష్ణ పరమహంస'; 'పరమ హంస పరివ్రాజ కాచార్య' ఇత్యాదిగ మనము వినుచుందుము. ఇందు 'హంసీ' యనుటచే 'యోగిని' యైన శబరి పంపా తరంగిణీ తటమున గలదని గ్రహించవలెను. 'యోగినీ రూప కామెకు నుద్దిలేదు' అని శ్రీ విశ్వనాథ.

తేజోమయము, నిదానము, శాంత స్వభావము, తెల్లగ నుండుట, నీరక్షీర విభాగమున యుక్తాయుక్త (నిత్యానిత్య) విచక్షణ జ్ఞానము కలిగి యుండుట అనునవి హంస లక్షణ ములు. ఈ లక్షణములు శబరి యందు కాంచగలము. వెండి కొండవలె తెల్లగ నుండి దివ్యులైన వాణీ చతుర్ముఖుల వాహనమై యుండు హంస 'సత్త్వగుణోపేత'యై యుండుట లోక విదితమే. ఇటు యోగినియైన శబరి 'సత్త్వభావ' సంపదను హంసీ శబ్దము ధ్వనింప జేయుచున్నది. నన్నయ

శ్రీ నాథాది కవులును తమ కావ్యములందు నలోపాఖ్యానమున హంసల సాత్త్విక లక్షణమును పేర్కొనిరి. వేదములందు హంస కొక ప్రత్యేక స్థానము కలదు.

"బీభత్సూనాం సయుజం హంస మాహు
రపాందివ్యానాం సఖ్యే చరంతం"
- ఋగ్వేదము X - 124 - 9

అనగా 'కలత చెంది బీభత్సముగ నున్న 'దివ్యా'పగా జలములకు నెమ్మది కలిగించు పక్షి రూపమునకు హంస యని పేరు.

ఇట సీతా వియోగముచే కలత చెంది సంక్షుభిత చేతస్కుడైన 'దివ్య' పురుషుడు శ్రీరామచంద్రునకు వన్య ఫలాది సమర్పణము చేతను, విజ్ఞాన వంతములైన వాక్కుల చేతను పరిచర్య సలిపి రాముని మదికి నెమ్మది నొసగి ప్రశాంతత చేకూర్చిన 'పరమ హంసి' శబరి. "ఆ సమయంబు నందున ధరాత్మజ సైతము విస్మృతింబడెన్" అని సౌమిత్రితో రాముడనుటయే యిందులకు నిదర్శనము. ఇంతటి భావి కథార్థ సూచనముతో హంసీ శబ్దప్రయోగము ద్వారా శబరి పాత్రను పరిచయము చేయుట గడుసుదనము. కథా కథన శిల్పము నందలి యొక గడుసరి మార్గమిట్లు భవిష్యత్కథా సూచనము చేయుటయే. శబరి కథ నిట్లు ప్రారంభించుట ఎంత సొగసుగ నున్నది!

దీనిని బట్టి శబరి వృత్తాంతమున ప్రస్తావించబడిన హంసి సామాన్యమైనది కాదనియు, దేవతాభావ సంబంధమైన హంసి యనియు, ఆ దేవ హంసియే శబరి అనియు మనము గ్రహింప వలసి యున్నది.

'హంసకు హగ్ంస' అను రూపాంతరము గలదు. "హూగ్ంస శ్శుచిషత్" అను సుప్రసిద్ధ వేదమంత్రములలో హంస ప్రశంసింపబడినట్లును అయ్యది ఖగోళ సంబంధితమైనట్లును శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావు గారు తమ 'సన్నయభట్టు విజ్ఞాన విరతి' అను గ్రంథమున తెల్పిరి. శ్రీ విశ్వనాథ వారును శబరిని ఖగోళమందుగల 'ద్యులోక మున వృద్ధి పొంది పుట్టు కానిపించుచే గానిపించిన ఒక దేవతా రూపమైన దీధితి'గా పేర్కొనిరి. హంస యనగా సూర్యుడనియు తెలియనగును. దీనిని బట్టి శబరి స్థానమెచట గలదో మన మూహింపవలెను. ఆత్మ విజ్ఞానము నందు స్త్రీ పుంభేదము లేదు.

'శ్రీమదాంధ్రరామాయణ వైభవము'ను పరికించగా శబరికథచే స్త్రీలును పురుషులతో సమానముగ బ్రహ్మచర్య మవలంబించి, యోగ సాధనలు చేసి, ఇంద్రియ జయమును గావించి, ఆత్మ విజ్ఞానము నొంది 'బ్రహ్మవాదినులు'గ నుండుట కర్హలనియు, కనుక మానవమాత్రునకు ఆత్మజ్ఞానము నొందుటకు అధికారము గలదనియు స్పష్టముగ దెలియుచున్నది.

మరొక విషయము. భూతాత్మలందొకటైన హంస వాయువు ఒకటి శరీరగతమై యున్నది. మరణానంతర మిది భూమిపై నేమూష వాయువు నందు వాయవ్య శరీరియై సంచరించునట. దీనినే 'గాలి' యని, 'భూత'మని మనవారు చెప్పుచుందురు. భగవత్సాక్షాత్కారము నొందిన శబరి వంటి ఆత్మ జ్ఞానులయందిది శక్తిహీనమైనదగును గనుక నింతకన్న నిట దీని వివరణ మప్రస్తుతము.

శబరిని మనము దైవీభావ సంబంధమైనట్టియు, సూర్య సంబంధమైనట్టియు, ఆత్మజ్యోతి యొక్క అంశగను, భగవ దర్పితమైన మనః ప్రవృత్తిగను జ్ఞప్తి యందుంచుకొనవలసి యున్నది.

మన్మథ ప్రవేశము : శబరి రామా ! యని పిలచినది. 'ఆ_రామ' శబ్దాత్మకమైన అనిల స్పర్శమును అదనుగ తీసుకొని కుసుమ బాణుడు బాణముల చివర తమ్మి పూవును సంధించి క్ష్మాసుతా విరహ జడుడైన రాముని మీద విడువగా ఆ బాణము రాముని ఆత్మలో పడినదట. ఇటు మన్మథుడెట్లున్నాడు?

మధ్యాక్కఱ :

మెడలో సందులసి పేరొకటి మెత్తని మేని విభూతి
వడిచెయ్య విల్లూని కుసుమ బాణుండు బాణంబు చివర
సడలు రేకుల తమ్మిపూవు సంధించి క్ష్మాసుతా విరహ
జడు మీద రాముని మీద జ్యావల్లి సారించి విడిచె॥

వెంటనే రామునకు శబరిని చూచు కోరిక కలిగినది. రాముడు సౌమిత్రితో నిట్లనుచున్నాడు.

> తెలి తమ్మిపూవు బాణము
> వలెనయి నా యాత్మలోనఁబడినట్లయ్యెన్
> పలి మేని ప్రసన్ననగు ముడు
> తల శబరినిఁ జూచు కోర్కి తారాడు మదిన్॥

మెడలో తులసి పేరులు, మేనికి విభూతి ధరించి మన్మథు డుండుట చిత్రము. అసలీ శబరి కథ 'మధ్య' మన్మథ పాత్ర ప్రవేశమునకు గల 'అక్కఱ' యేమి? ఇందేదో రహస్య ముండును. ముందు పరిశీలింతము.

<u>రామ దర్శనము–శబరి పారవశ్యము :</u> మెట్టు పళ్ళికలో పేర్చిన పూవులు పండ్లను శిరసుపై నిడుకొని మెల్లగా శబరి వచ్చినది. అపుడామె ఎట్లున్నది?

> "తుట్టతుద దాఁక నెండిన చెట్టుకొమ్మ
> శేఖరంబున యందుఁబుష్పించినట్లు" న్నదట.

ఆ శబరి కనులలో స్వామి తన ప్రతిబింబమును చూచుకొని సీతా విరహ బాధను విడిచెనట. 'నీరార శబరి కనులు తేరు కొనియె' ననుటచే స్వామి దర్శనముచే శబరికి కలిగిన ఆనందాశ్రు జలము నందు రాముడు తన ప్రతిబింబమును

చూచినాడన్నమాట. జలధిశాయి యైన నారాయణుడు రాముడు శబరి నేత్ర జలము నందు తన ప్రతిబింబమును చూచుట అనగా "మమైవాంశో జీవలోకః జీవభూతస్స నాతనః" అనునట్లు భగవదంశయైన జీవునిలో నున్నది భగవంతుని ప్రతిబింబమని సూచించుటయే. జీవేశ్వరుల బింబ ప్రతిబింబ భావ సంబంధమిట గమనింప వచ్చును.

తలపై గల పూవుల తట్టదింపకయే శబరి—"అయోధ్యా వీథులన్నిన్ని నావలెఁగన్గొనగు వారలుందురె! యసం బ్రాణేశుఁడువ్వెత్తు నవ్వుల నచ్చో సినువంటి వారు కలరా! పూఁబళ్ళికందింపుకో" అని రాముడనెను. మరచితిని స్వామీ యనుచు తట్టదించినది. పూలు చూచి స్వామి మునివ్రేళ్ళ గైకొనుచు తన చరణ యుగముపై తానే చల్లుకొనెనట.

రాముడిట్లు చేయుట ఏమి? శ్రమణియైన శబరి చేయ దలచిన పని తానే చేసి ఆమె శ్రమను తగ్గించుటకా? ఆ పూలను నీ విట్లు చేయవలెను సుమా అని ఆమెకు బాహ్య స్పృహను కల్పించు నుద్దేశముతో జ్ఞప్తి చేయుటకా? ఏమైనను పూలు చల్లుకొనుటను తాను చేసి చూపి మరల నామెచే చేయించుకొనుట యందేమంత ఔచిత్యము గలదు? అపుడు అయ్యో! స్వామి యనుచు శబరి దోసిళ్ళతో పూలను రామచంద్రుని పాదములందు చల్లినది. ఇట్టి మరపునకు కారణ మేమి? ఆమె 'పారవశ్య' స్థితియే. రాముని చూచిన వెంటనే

ఆమె ఆ రామచంద్రుని 'పర' తత్త్వము నందు 'వశ'మైనది. కనుకనే తట్టు దింపకయే 'అయోధ్యావీధుల న్నిన్ను నావలె కన్గొనగువారలుందురె' అని అడిగినది. అనగా నామె శ్రీరామ చంద్రునిలో కనుగొన్న తత్త్వము విలక్షణము, విశిష్టమైన దన్న మాట.

మనసా ఆత్మ తత్త్వము నెరిగిన ప్రాణి శబరి, "ఆ సమంతాత్ వ్యాప్నోతీఽతి ఆత్మా" అని ఆత్మ నిర్వచనము. రాముని ఆకారమును చూచినప్పు డామెకు ఆకాశము, సము ద్రములు, వనములు చూచి నట్లుండెనట.

"ఆకాశంబు సముద్రమున్ వనము లాహా చూచి
నట్లుండె నీ
యాకారంబది విస్మృతిం బడితినయ్యా!...."

అనుచు తాను పారవశ్యమున మునుగుటచే జీవ సహజమైన విస్మృతి యందు బడి పూలు చల్లుట మఱచితినని చెప్పినది. ఇట్లు వ్యాపక శీలమైన, అనంతమైన, ప్రకృతి గతమైన పర మాత్మ దివ్య తత్త్వమును స్మరించి యామె ఆనందించినది. కనుకనే రాము డామెను 'ఆనందమతీ! అని సంబోధించెను. ఆ యానందమునకు మూలము రాముడే కనుక రాముని 'ఆనంద మూల' అని ఆమె సంబోధించినది. ఆమెకు 'మతి' అనగా బుద్ధి రామ సందర్శనమున ప్రసన్నమైనట్లు గుర్తించి

నది. కావుననే రాముని 'బుద్ధిధారా ప్రసన్న' అన్నది శబరి. ఇచట విశ్వనాథ సంబోధనలు సాభిప్రాయములు.

నీ కోసమేనయ్యా తెచ్చితిననుచు శబరి రుచ్యములైన పండ్లను ప్రదర్శించి తినుమని కోరినది. నట్టడవిలో నిలబెట్టి 'రామ! రామ!' పండ్లు తినుమనుచున్నావు. నేను కాళ్ళు కడిగికోవలయును, కనులు తుడిచికోవలయును, స్నానము చేయవలెను, కాదీపాటుననే భుజింపుమన్నచో కాదందునా? నీకు అమర్యాద చేయుట ఎందుకులే అనినాడు రాముడు. అపుడు శబరి 'ధర్మ స్పృష్ట దృక్పక్ష్మ'యై- "ఈ దేశంబునం జెట్టు చెట్టు గృహమే యీనాకు, నీకేమొ స్నానాదుల్ నిత్య పవిత్ర మూర్తికిని మర్యాదా మహాంభోధికిన్" అనినది. శబరి ధర్మ స్పృష్ట దృక్పక్ష్మయట.

"సచాస్య కథయా మాస శబరీం ధర్మచారిణీమ్
శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ॥
అని వాల్మీకి రామాయణము. బాల. కాం. శ్లో. 56

కొందరు పెద్ద పెద్ద గృహములందుండియు చెట్టు క్రింద కాపురముండుచున్నంత అసంతృప్తిని ప్రకటించుచుండుట మనము చూచుచుందుము. శబరి ప్రతి వృక్షము తన గృహమే యని భావించినది. తృప్తి నొందుటకు భావము ప్రధానము. రాముడు నిత్య పవిత్రమూర్తియని, మర్యాదా పురుషోత్తముడని గ్రహించినది శబరి ఆమె యిల్లనుచున్నది.

చేతులునికినిఁబూలు తెచ్చితిని స్వామి
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి
సతను వగుటను నేను వచ్చితిని స్వామి
చిత్తముండుట నూహ చేసితిని గాని

అనుచు శరీర దృష్టితో తాను గావించిన చేతలను నిర్వికార ముగ దెల్పుచునే మరల—

నేఁబూలు తేలేదు నేఁబండ్లు తేలేదు
లీలామనోజ రాలేదు నేను
క్రొత్తగా నీవు మా కొండిక చోటికి
రాలేదు బుద్ధిధారా ప్రసన్న !

అనుచు ఆత్మ దృష్టితో జీవాత్మల బంధము క్రొత్తది కాదనియు, అనాద్యనంతమనియు విన్నవించినది. మరియు—

పరిచారకా స్వభావకు నాకు మరియాద
చేయ నక్కఱ లేదు చిత్తజన్మ!
అల యగస్త్యాది మహర్షుల వనముల
ఫలములీ రుచి కావు ప్రాణనాథ!
నాదు ప్రాణములను నీకు మీఁదు కట్టి
నాను నీ వయి యిటు వచ్చినావు స్వామి
మొక్కి చెల్లింతు స్వీకరింపుము ప్రియాంగ
నా మహాయల్ల కౌసల ధూమ దేహ!

<u>అగస్త్య వనఫల రుచి</u> (అగస్త్యతత్త్వము) : శబరి తన గురువగు మతంగముని వన ఫలములు రుచికరములని చెప్పిన బాగుగాని 'అగస్త్యాది మహర్షుల వనముల ఫలములీ రుచి కావు' అనుటఏమి? అనగా శబరియు అగస్త్యాది ఋషుల వనఫలములను గూడ రుచి చూచినదన్న మాట. నిజమే. మరి వేని రుచి వానిదే. మతంగ వన ఫల రుచివేరు, అగస్త్య వన ఫలరుచి వేరు.

"ఋషయః ప్రాణాః" అని వాల్మీకము. అనగా ఋషులు ప్రాణభూతులై యుందురు. అగస్త్య ప్రాణము జల శోషకము. ఆధ్యాత్మికముగ నిది సకల శరీరము లందును ప్రాణ రూప మున నుండును. ఇది ప్రాణ విద్యకు సంబంధించినది. నిదాన విద్యానుసార మేర్పడిన భౌతిక చరిత్ర యందును అగస్త్యుడు సముద్రమును పీల్చినట్లు కలదు.

".... అట్టి యాచుక్క మగవాని యయ్యనొయ్యఁ
గొంటి వాపోశనం బొక్క గ్రుక్కనీవు
నీ ప్రభావంబు లోకఁడు వర్ణింపఁగలఁడె
పరమ పుణ్య! యగస్త్య! తాపస వరేణ్య!

- రామాభ్యుదయము. పం. ఆ. ప-121.

"Salutations to the Great Saint Agastya
Who drank up the vast ocean
For his mercy and for his blessings."

- Lives of Ancient Indian Saints. Vol. I

ఆ జల శోషకత్వము అగస్త్యున కెట్లబ్బినది? అగస్త్యుడు 'సూర్యాగ్నుల శక్తి' సంభవుడని యాతని జన్మ వృత్తాంతమును పరిశీలించిన తెలియగలదు. వివరములకు— "Lives of Ancient Indian Saints" గ్రంథమున The Birth of Agasthya అను శీర్షిక చూడనగును.

'తపింప జేయుచున్న సూర్యుడే జలస్థానమునకును అధినేత. జలస్థానమే ఆదిత్య స్థానము. వీటి పరస్పర అభేద స్థితిని ఎరిగిన వారు ముక్తులగుదురు.' అని మంత్ర పుష్పము నందలి ఈ క్రింది మంత్రము నందు వివరింపబడినది.

"యోఽపా మాయతనం వేద, ఆయతనవాన్ భవతి,
ఆపోవై తపన్న పామాయతనం, ఆయతనవాన్ భవతి,
యోఽముష్య తపత ఆయతనం వేద, ఆయతనవాన్
భవతి ఆపోవాఅముష్య తపత ఆయతనం,ఆయతనవాన్
భవతి య ఏవం వేద — ౧౬

సూర్యశక్తి సముద్రి జల శోషక మగుట అధిదైవికము. సకల శరీరులందు జలశోషక జలగ్రహణ ప్రాణరూప అగస్త్య శక్తి ఆధ్యాత్మికము. అగస్త్య ఋషి సముద్ర పానము చేయుట అధి భౌతిక కథనము. సముద్ర మనగానేమి ? దానిని పానము చేయు నతని శక్తి ఏమి? అగస్త్యభార్య లోపాముద్రి ఎవరు? వంటి నిగూఢ రహస్యములు గురు ముఖతః నేర్వ దగినట్టివి.

శబరి యట్లు నేర్చినది. శబరి గురువు మతంగ ముని. "వ-బ యోరభేదః" అను సూత్రముచే 'శబరి-శవరి' అగును. "శేతేవరే ఇతి శవరీ" అను నిర్వచనము ప్రకారము సర్వ శ్రేష్ఠుడైన భగవంతుని యందు శయనించి యుండునది అనగా భగవంతుని గూర్చిన నిరంతర మానసిక వృత్తియే శబరి" అని అంతరార్థ రామాయణము నందు శ్రీ వేదుల వారి వ్యాఖ్య. (పు 82).

ఆధ్యాత్మికమైన నిట్టి మానసిక ప్రవృత్తి 'మతంగుని' ఆశ్రయించినది. మతికి సంబంధించినది మతము. మతి అనగా జ్ఞానము జ్ఞానమును 'గ' పొంది యుండునది మతంగము. "మతం గచ్ఛతి ప్రాప్నోతీఽతి మతంగః" అని మతంగ శబ్ద నిర్వచనము. శబరి ఈ మతంగ ముని పరిచర్య చేసి తప స్సాధన గావించినది. తాను పొందిన విజ్ఞానముతో ఏ ఏ ఋషి ప్రాణ తత్త్వము లెట్టివో గుర్తించినది. ఆయా ఋషి తత్త్వ ఫలముల రుచు లనుభవించినది. కనుకనే శ్రీరామ చంద్రునితో 'అగస్త్యాది మహర్షుల వనముల ఫలముల రుచి' వేరని నిశ్చయ జ్ఞానముతో పలికినది. శబరి ప్రత్యేకముగ అగస్త్యునే పేర్కొను టలోని ఆంతర్యము ఆమె కూడ ఆదిత్య సంబంధమైన దీధితి యగుటయు నొక కారణముగ గుర్తింపవచ్చును.

<u>సతనువు, ప్రాణనాథ! లీలామనోజ! అనుట ఏమి? :</u>

శబరి రాముని ప్రాణనాయక! ప్రాణనాథా! అని సంబో

ధించును. శబరికి రాముడు ప్రాణనాథు డెట్లగును? అంతేకాదు 'సతనువు' 'లీలామనోజ' 'చిత్తజన్మ' అనియు పిలచును. నడుము వంగి, సీమంత ప్రదేశ మాత్ర మృదు శిరోజయు, శిత పక్ష్మాంత కేశ ధవళిత దృష్టియునై, ఎండిన చెట్టువలె నున్న ముదుతల శబరిని చూచినచో రామునకు సీతా వియోగ విస్మృతి కలుగుట ఏమి? పైగా ముసి ముసి నవ్వులతో రాముడే యిట్లను చున్నాడు-

"క్షోణి సుత యందమును జూచి చూచి చువ్వ
నాక ననుఁజూచి కామించినది యనంగ
క్షోణి తనయ సౌందర్యంబు చూడనట్టి
దాన వీ నన్ను కోరుట తప్పులేదు॥

నీ యీడేమిటి నీదు మేను భుజగీ నిర్మోక మన్నట్లుగా
నా యీడేమిటి నా శరీరమును సంతానద్రుశాఖాకృతిన్
బోయెంబో ననుఁజిత్త జన్ముఁడనుచుం బొల్లంబడన్ ప్రాణనా
థా యంచాడెదు నాకు నీ యెడలఁ జిత్తంబట్లనే యున్నదిన్॥

శబరి మేను భుజగీ నిర్మోకమన్నట్లుగా నున్నదట. శబరి రూపము నందిట్టి అరూపత కన్పట్టినను రాముని చిత్తమున కాపరిసన్నత ఏమి? శబరి ప్రాణానాథా యనుటయు,

రాముడును నీ యీడేమిటి? నా యీడేమిటి? అనుచునే నాకు నీ యెడల చిత్తంబట్లనే యున్నదనుటయు, నీవు నన్ను కోరుట తప్పు లేదనుచు ఆమె పిలుపులందలి వలపు నంగీక రించుటయు అంతయును విడ్డూరము. పైగా రాముని ఏకపత్నీ వ్రత భావన కిది భంగము. మరియు

"రామో విగ్రహవాన్ ధర్మః సాధు స్సత్య పరాక్రమః
అప్రమే యంహి తత్తేజో యస్యసా జనకాత్మజా"

అనిన వాల్మీకి మహర్షి రామ పాత్ర చిత్రణమున కిది గొడ్డలి పెట్టు. 'వాల్మీకి ప్రతిపాదించిన గుణములను బయటకు తీసి వ్యాఖ్యానము చేయుదు'నని చెప్పకొనిన విశ్వ నాథయే కథ నిట్లు నడపించునేమి? బహుశః శ్రీరాముని పరిహాస శీల పోషణమున కిట్టి విచిత్ర ధోరణి ననుసరించె నేమో! బాల కాండమునందు రాముని బాల్యక్రీడను వర్ణించుచు విశ్వనాథ "తా హాస్యాద్భుత శీలి రాముడు" అని చెప్పెను. మరియు శబరి ఖండమునందును రాముడు సౌమిత్రితో నిట్లనెను.

నన్నుం జూచిన నాకె చిత్రమగు నన్నా యామెతో
హాస్యముల్
కన్నన్ సాధువులైన వృద్ధుల చునః కంజాత మట్లు
వ్యేడిన్

నన్నుం జూచిన వారి కళ్లెయగు నైనంగాని యీ
యోగినిం
గన్నా నా! శబరిన్ బ్రమోద భరముం గన్నాను
చిత్రంబుగన్॥

కనుక నిట్టి సంభాషణము వృద్ధులతో పరాచకము కావచ్చును. కాని అంత మాత్రమే కాదు.

మధుర భక్తి : 'తన యందు స్త్రీత్వమారోపించుకొని పరమాత్ముని జగత్పతిగ భావించుట మధుర భక్తి లక్షణము. నిజమునకు పరమాత్మ యొక్కడే పురుషుడు. జీవులందరును స్త్రీలే. ఇదియే సీతాదేవి ఆంజనేయునకు చెప్పినది. సాంఖ్య దర్శన మీ భావమునే ప్రదర్శించు చున్నది. తరువాయి మొజ్జియందు తిరునమ్మాళ్వారులును, శృంగార సంకీర్తనము లందు తాళ్ళపాక అన్నమాచార్యుల వారును ఇట్టి మధుర భక్తినే ప్రదర్శించిరి'. శబరికి రాముని యందు గలభక్తి, అను రక్తి మధురభక్తి అనియే కొందరి ప్రతిపాదనము.

దేవ రహస్యము : దేవ రహస్యములు చెప్పకూడదని పెద్దల అభిప్రాయము. నిజమే. విశ్వనాథవారి అభిప్రాయము కూడ నిదియే. కాని వారే 'కల్పవృక్ష రహస్యములు' రచించిరి కనుక మనము పరిశీలింతము.

కారణ శరీరము నందుగల ఆత్మకు ప్రభవము సూర్యుడు. రాముడు సూర్యవంశ సంజాతుడు కనుక ఆత్మ రూపుడు. "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" అని శ్రుతి. చైత్ర శుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రమున రామజననమైనట్లు వాల్మీకము. పునర్వసు సూర్య సంబంధి అయిన నక్షత్ర మగుటయు గమనింపదగినది.

"సవా ఏష ఆత్మా వాఙ్మయః
ప్రాణమయో మనోమయః"

అని సోపాధి కాత్మ లక్షణము. దీనిని బట్టి ఆత్మకు ఉపాధి వాక్కు (శరీరము), ప్రాణము, మనస్సు అని తెలియు చున్నది.

కావుననే విశ్వనాథ-'సవాఏష ఆత్మావాఙ్మయః' అనుదానికి 'సతనువు' అనియు; 'ప్రాణమయః' అనుదానికి ప్రాణనాథా! ప్రాణనాయక ! అనియు; 'మనోమయః' అనుదానికి లీలా మనోజ! చిత్తజన్మ! వంటి సంబోధనలలో శ్రుతి రహస్యమును శబరిచే పలికించి రామునిచే అట్లనే యున్నదనిపించినాడు. ఈ సంబోధనలు సార్థకములే గాని నిరర్థకములు కావు. పరోక్షమైన ఈ వాఙ్మనఃప్రాణాత్మల సంయోగ రహస్య తత్త్వమును శబరి రాముల ప్రసంగమున విశ్వనాథ చిత్రముగ నిక్షిప్తము గావించెను.

రామాయణ రహస్యమును పూజ్యపాదులు మా నాయనగారు శ్రీమాన్ శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్యులవారు తమ 'శ్రీమహాభారత వైజ్ఞానిక సమీక్ష' గ్రంథము నందిట్లు వెల్లడించిరి-

"ఆత్మ శక్తిని 'సత్' అందురు. "మనఃప్రాణ వాచా సంఘాతం సత్తా." సత్ అనునది శక్తి బీజమగు 'ఇ' కారముతో గూడి 'సీత' యగును. సృష్టి దశయందు మన ఆత్మశక్తి యోగ మాయా ప్రభావముచే నాహరింపబడుటయే. సీతాపహరణము. ఇది మనకు హృదయ విదారకమగు విషాద ఘట్టము. భౌతిక శరీరమందు మనము గోలుపోయిన ఆత్మ యొక్క 'సత్' శక్తిని సత్యాన్వేషణము చేసి సాధించుటకు మర్యాదా పురుషోత్తముడగు శ్రీరాముని సచ్చరితము మనకు మార్గ దర్శక మగును. రాముని అయనము రామాయణము".

దీనిని బట్టి సీతావియోగము ఆత్మశక్తి వియోగమన్న మాట. విశ్వనాథ వారు రాముని 'సీతా విరహజడు' డనిరి. ఆత్మశక్తి వియోగముచే దేహమునకు కలుగునది జడత్వమని అభిప్రాయము. అట్టి జడీభూత భావము శబరిని చూచినప్పుడు రామునకు పోయి ఆత్మశక్తి చేకూరినట్లయ్యెనని భావింపవలెను. సీతాన్వేషణకై జరిపిన రాముని అయనములో ఈ శబరి స్థితి ఒక మజిలీ.

"ఆ కాంతా విరహార్తుఁడ
నాకును నీవిట్లు వలచినా విది భాగ్యంబే...."
"ఆ సమయంబు నందున ధరాత్మజ సైతము విస్మ్రతింబడెన్"

అని రాముడే స్వయముగ పలికినాడు.

వైరాగ్య మన్మథ వైశిష్ట్యము : వియోగుల విరహమును దీర్చు వాడెవడు ? మన్మథుడు. ఇటు శబరీ రాముల సంధాన కర్తయు మన్మథుడే. మన్మథుడనగా మనసును మథించువాడని యర్థము. "మననమ్ మత్ చేతనా తాం మథతీ౨తి మన్మథః" అని మన్మథ శబ్ద నిర్వచనము. 'మంథ విలోడనే' అనుధాతువునుండి మన్మథ శబ్ద మేర్పడినది. పరబ్రహ్మమును గూర్చిన శబరి నిరంతర మానసిక వృత్తిని మథించినాడీ మన్మథుడు. ఇటు శబరికి జరిగిన మథనము ఆత్మ సంబంధమైనట్టిది. "శబరీ నత నేత్రాంభోజమ్ముల అతను విధాతృలు ఫలించిరా!" యన నుండెనట. ముదుసలి శబరి నేత్రమున విధాత ఫలించుట ఉచితము కావచ్చును గాని 'అతనుడు' ఫలించుట యేమి? ముడుతల శబరికిని ముప్పది యేళ్ళు పైబడిన రామునకును మధ్య ఈ అతనుని ప్రస్తావనము దేనికి?

న + తనుడు = అతనుడు

అనగా నిది తను (శరీర) సంబంధము కానిది; విధాత శబ్దముచే నిది బ్రహ్మతత్త్వ సంబంధమైన దనియు సూచించుటకే. కనుకనే మెడలో తులసి పేరు, మేని విభూతితో మన్మథ వేషమట్లున్నది.

మతంగ ముని మహిమచే అడవి యంతయు బ్రహ్మమయమైనది.

"అడవిఁ జరించు శిష్యజనులంగములన్ జెమరించి స్వేదముల్
పొడమిన మిక్కిలిన్ బడలిపోదురటంచు దయాతరంగముల్
పొడిచిన యట్టిమౌని యవుఁబో యమృతో దధి యింత మిన్నులో
నడవిని వ్యాప్తమౌ మహిమ యయ్యది బ్రహ్మపదార్థ కల్పమౌ॥

అ మతంగ విశేషోజ్జ్వలమౌ మహా మహిమకుం గైమోడ్పు సంధించినాడు రాముడు. అట్టి మహిమాన్వితమైన ప్రదేశము నందు ప్రత్యక్షమైన మన్మథుడు కనుకనే మెడలో తులసి పేరు, మేని విభూతి ధరించి యున్నట్లు విశ్వనాథ వారి వర్ణనము. ఇట్లు వర్ణించుటలో గల బ్రహ్మ రహస్యము హరి హరా ద్వైత

తత్త్వము నావిష్కరించుటయే. తులసి హరిది; విభూతిహరునిది. ఇట్టి తత్త్వము శబరి నేత్రము లందు అనగా నామె విజ్ఞాన నేత్రము నందు ఫలించెనని గుర్తింపవలెను.

తులసి పేరులు, విభూతి దాల్చిన ఈ మన్మథుడు వేసిన బాణము రాముని ఆత్మలో పడినది. సామాన్యముగ శృంగార మన్మథుడు బాణము వేసినచో అది మనసునకు తగులును. కాని విశ్వనాథ విచిత్రముగ 'వైరాగ్య మన్మథుని' సృష్టించినారు. ఆత్మ సంబంధమైన శబరి ఆర్తిని రాముని ఆత్మలో చేర్చి శ్రీరాముని శబరి వద్దకు చేర్చినవాడీ మన్మథుడే. ఇతడు తమ్మి పూవును సంధించి రాముని మీద బాణము విడువగా—

"తెలి తమ్మిపూవు బాణము
వలె నయి నాయాత్మలోనఁ బడినట్లయ్యెన్
వలి మేని ప్రసన్ననగు ముడు
తల శబరినిఁ జూచు కోర్కి తారాడు మదిన్.

అని సౌమిత్రితో రాముడనుటయే యిందులకు నిదర్శనము. శబరి వృత్తాంతము నందీ మన్మథ సృష్టి అపూర్వము. ఇట్టి వినూత్న ధోరణి ఇతర రామాయణము లందు కానరాదు.

<u>ముసలమ్మకు కామమేమిటి ? :</u> కామ మనగా కోరిక. అది రెండు విధములు.

1. శరీర కామన
2. ఆత్మ కామన

మొదటి దానిని కోరినది శూర్పణఖ. రెండవ దానిని కోరినది శబరి. శూర్పణఖ ఆసురి. దేవతాభావ శబలిత శబరి. శరీర మాసురము. నశించు స్వభావము గలది; ఆత్మదైవతము, నిత్యము. సీత యనగా ఆత్మశక్తి యనుకొంటిమి కదా! ఆశక్తి తన చెంతనే యున్నను అసురి కనుక చుప్పనాక మోహమున శరీర భ్రాంతిలో పడి రాముని శరీరమునే వాంఛించినది. ఇపుడా ఆత్మశక్తి తన చెంత లేకున్నను, ఆ శక్తి సౌందర్య మెట్టిదో తన చర్మ చక్షువులతో చూడ కున్నను, సంస్కార విశేషమున శబరి రాముని ఆత్మ సాక్షా త్కారమునే కోరుట తప్పు కాదనుచు ముక్తి భావ బంధైక కబరి యైన శబరి స్థితి నెరిగిన రాముడనుటలో ఆశ్చర్యమేమి? ఈ రహస్యము తెలియక కొందరు, కామ మనగా శారీరక శృంగార సంబంధమైన లౌకిక కామమనియే యెంచి 'ముస లమ్మకు కామమేమిటని' అధిక్షేపించుచున్నారు. సూక్ష్మ వివేచనమున పరిశీలించిన గాని యిట్టి రహస్య తత్త్వము లవగతము కావు.

శబరి ఫల సమర్పణము : శబరి పేరు వినినంతనే రామచంద్రునకు ఎంగిలి పళ్ళు సమర్పించిన ఒక అమాయికము, అనాగరకము నగు శబర జాతికి చెందిన మూఢభక్తురాలు మనకు గోచరించును. కొందరు కవులామె చర్యను భక్తికి పరకాష్ఠగ కవితా శిల్పముతో వేనోళ్ళ ప్రశంసించిరి. అందు కొన్ని-

"అదిగో! బోయెత - యెదురుగ
గుదురుగఁ గూర్చుండి పండు కొరుకుచు నోటన్
బెదవులు కదలించుచుఁడా
నెదియో! యనుచుండె శీర్షమిటునటు కదలన్॥

మరచెను దేహమీశబరి, మానసమెల్ల మదేక భావనా
భరమయి యుంట, జేయుపని పాపము, పుణ్యమెఱుంగ
దంతగా
నెఱిగిన బండు దాగొఱికి యిచ్చునె? యిచ్చిన
స్వీకరింతునె?
కొరికిన పండు నేదినగ గోరిన రాదు గదా! సహోదరా!"

- శబరి : శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

"అంబా! నీ యపరాధమెంత మహనీయారాధనంబయ్యెలో
కంబందెవ్వరి పుణ్యమింత పరిపక్వంబయ్యెఁ జేసాచెఁజి

త్రంబీ యెంగిలి పండ్లకే రఘు కులోత్తంసంబు దైవంబు బా
వంబే చూచు నితఃపరంబు లితరుల్ పాటిం తురన్నట్టులన్!

- శబరి : శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి

అసలు ఈ ఎంగిలి ఫలములు శబరి రామునకు సమర్పించినదనుటకు మూలము జనశ్రుతియా! లేక ఎందైన ఆధారము కలదా ? అను మీమాంస పరిశీలనార్హమైనట్టిదియే. కొందరు దీనికి మూలము పద్మ పురాణోత్తర ఖండమునందు గలదని

"ఫలాని సుపక్వాని, మూలాని మధురాణిచ
స్వయ మాస్వాద్య మాధుర్యం, పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చాన్నివేదయామాస, రాఘవాభ్యాం దృఢవ్రతా"

అను వాక్యములను చూపగా ముద్రిత పద్మపురాణములందీ వాక్యములు లేవనియు

"ఫలానిచ సుపక్వాని, మూలాని మధురాణిచ
నివేదయా మాస తదా, రాఘవాభ్యాందృఢవ్రతా"

అని మాత్రమే కలదనియు ఉచ్ఛిష్ట ఫల ప్రసక్తి లేదనియు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము మందర వ్యాఖ్యానమున దెల్పియుండిరి.

"శబరి, రుచిచూచిన ఉచ్ఛిష్ట ఫలాలను రామునికి పెట్టడంలోనే ఆమె వాత్సల్య పూరిత భక్తికి పరాకాష్ఠత సిద్ధిస్తుంది. రాముడు ఆమె ఎంగిలి ఫలాలను ప్రీతితో ఆరగించుటలోనే అతని భక్తవత్సలత పరాకాష్ఠత నందుకొంటుంది. భగవంతునికి భక్తునియొక్క ప్రేమ యుక్తమైన భక్తి ప్రధానం. అట్టి భక్తులు ఎంగిలి ఫలాలను పెట్టినా! చింపిరి గుడ్డలో మూటగట్టిన చిరుతిండి పెట్టినా! పరమ ప్రేమాదర భావంతో భక్షించి వారి అభీష్టాన్ని తీర్చి వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. కాబట్టి శ్రీరామునికి శబరి ఎంగిలి ఫలాలను సమర్పించడంలో కాని శ్రీరాము డారగించడంలో గానీ అనౌచిత్యం లేదని చెప్పడమే ఔచిత్యం" అని శ్రీమద్రామాయణ కల్ప వృక్షము శబరి పాత్ర_ఒక పరిశీలన అను - యం. ఫిల్. పట్టానికై సమర్పించిన తమ సిద్ధాంత వ్యాస గ్రంథములో సిద్ధాంతీకరించినారు శ్రీ జి. కుమారస్వామి నాయుడు గారు.

అసలు వాల్మీకి రామాయణము నందీ ఎంగిలి మాటయే లేదు.

"మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ
తవార్థం పురుష వ్యాఘ్ర! పంపాయాస్తీరసంభవమ్"
- వాల్మీకి రామాయణము.

ఇందు వన్యము, సంచితము అనుపదములచే ఎంగిలివిగను, చిరకాలము నుండి సంపాదించి యుంచిన పండ్లుగను చిత్రించినారు కవులు. "అప్పటి నుంచీనా కుళ్ళిపోవూ? చీ........ చీ....చీ....వాసన" అంటూ 'విష' దృష్టి కలిగిన విమర్శకులు ఆఫలములు సామాన్య ఫలములుగనే భావించి యెగతాళి చేసినారు కూడ!

"వివిధములైన వన్యములు వేడుక నేనొనఁగూర్చి మిమ్ముఁబ్రా
భవమునఁబూజ సేయఁగను బ్రార్థన సేసెద మీరు దీని గా
రవమున స్వీకరింపుఁడన రాఘవుఁడా రమణీయ వన్యముల్
బ్రవిమల బుద్ధిఁజేకొని తపస్విని కారఘు రాముఁడిట్లనున్॥

అని భాస్కర రామాయణము గాని, "వన మూల ఫలములు వలనొప్పఁ దెచ్చి యిచ్చిన భుజియించి" అనుచు శ్రీరంగనాథ రామాయణము గాని శబరి ఎంగిలి మాట ఎత్తనే లేదు.

ఈ శబరి ఫల సమర్పణమున విశ్వనాథ ఏమనుచుండెనో చూడుడు.

"శబరి, రుచిచూచిన ఉచ్ఛిష్ట ఫలాలను రామునికి పెట్టడంలోనే ఆమె వాత్సల్య పూరిత భక్తికి పరాకాష్ఠత సిద్ధిస్తుంది. రాముడు ఆమె ఎంగిలి ఫలాలను ప్రీతితో ఆరగించు టలోనే అతని భక్తవత్సలత పరాకాష్ఠత నందుకొంటుంది. భగవంతునికి భక్తునియొక్క ప్రేమ యుక్తమైన భక్తి ప్రధానం. అట్టి భక్తులు ఎంగిలి ఫలాలను పెట్టినా! చింపిరి గుడ్డలో మూట గట్టిన చిరుతిండి పెట్టినా! పరమ ప్రేమాదర భావంతో భక్షించి వారి అభీష్టాన్ని తీర్చి వారికి మోక్షాన్ని ప్రసా దిస్తాడు. కాబట్టి శ్రీరామునికి శబరి ఎంగిలి ఫలాలను సమ ర్పించడంలో కాని శ్రీరాము డారగించడంలో గానీ అనౌ చిత్యం లేదని చెప్పడమే ఔచిత్యం" అని శ్రీమద్రామాయణ కల్ప వృక్షము శబరి పాత్ర-ఒక పరిశీలన అను - యం. ఫిల్. పట్టానికై సమర్పించిన తమ సిద్ధాంత వ్యాస గ్రంథములో సిద్ధాంతీకరించినారు శ్రీ జి. కుమారస్వామి నాయుడు గారు.

అసలు వాల్మీకి రామాయణము నందీ ఎంగిలి మాటయే లేదు.

"మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ
తవార్థం పురుష వ్యాఘ్ర! పంపాయా స్తీరసంభవమ్"

- వాల్మీకి రామాయణము.

ఇందు వన్యము, సంచితము అనుపదములచే ఎంగిలివిగను, చిరకాలము నుండి సంపాదించి యుంచిన పండ్లుగను చిత్రించినారు కవులు. "అప్పటి నుంచీనా కుళ్ళిపోవూ? చీ........ చీ....చీ....వాసన" అంటూ 'విష' దృష్టి కలిగిన విమర్శకులు ఆఫలములు సామాన్య ఫలములుగనే భావించి యెగతాళి చేసినారు కూడ!

"వివిధములైన వన్యములు వేడుక నేనొనఁగూర్చి
మిమ్ముఁబ్రా
భవమునఁబూజ సేయఁగను బ్రార్థన సేసెద మీరు
దీని గా
రవమున స్వీకరింపుఁడన రాఘవుఁడా రమణీయ
వన్యముల్
ప్రవిమల బుద్ధిఁజేకొని తపస్విని కారఘు రాముఁ
డిట్లనున్॥

అని భాస్కర రామాయణము గాని, "వన మూల ఫలములు వలనొప్పఁ దెచ్చి యిచ్చిన భుజియించి" అనుచు శ్రీరంగనాథ రామాయణము గాని శబరి ఎంగిలి మాట ఎత్తనే లేదు.

ఈ శబరి ఫల సమర్పణమున విశ్వనాథ ఏమను చుండెనో చూడుఁడు.

"అంగీకరించిన నన్మదానీతముల్
పండ్లారగింపవే ప్రాణనాథ!
యన్నది శబరి సృక్కాంతముల్ జరర సం
ధ్యాబాలచంద్ర శృంగాగ్రములుగ
నవి నీవు తసి చూచి యతి రుచ్యము లటంచు
తెలియక నేనెట్లు తినఁగలుగుదు
నన్నాడు స్వామి...............

'ప్రతి వృక్షమందున ప్రథమ మందు నేను రుచి చూచియే తెచ్చినా నన్నది శబరి. ఫల ప్రకరము కుక్షినిండినది. రామ! విశ్రామము లేదు ప్రాణనాయక!.... ఆ ఫలముల్ తినవే దయామతీ!" అని శబరి ప్రార్థించినది. మతంగ మునికి శబరి చేసిన ఒక్కొక్క పరిచర్య నొక్కొక్క ఫలముగా చేసి యొసగుచుండ రాముడా ఫలముల నారగించుచు శబరితో చిత్రముగ ప్రసంగించుచు సీతావియోగ విస్మృతి నందినట్లుం డెనట. "పతి గాఁగఁగోరి నన్నే వరించి నవ ప్రతీక్షాబ్ధి వేలవై నయన వివృత తామరసములఁ జొచ్చినదాని ఫలము" అనుచు తుది ఫలమును శబరి రామున కందించినది. రాము డారగించెను.

నీవు పండ్లు రుచి చూచి రుచ్యములని చెప్పనగాని నేనెట్లు తినగలుగుదునని రాముడనుటయు, ప్రతివృక్షమందున ప్రథమ మందు నేను రుచి చూచియే తెచ్చినానని శబరి

సమాధానము చెప్పుటయు, అట్టి ఫలములను రాముడంగీక రించి స్వీకరించుటయు నెంత వింతగ నున్నదో సుంత యోచింపుడు !

భగవదనుగ్రహము పొందవలెనన్నచో మన కర్మ ఫలములను స్వామికి సమర్పించవలెను. కర్మను ఆచరించవల సినదియు, అనుభవించవలసినదియు జీవుడు, వాని ఫలము లను అర్పించవలసినది భగవంతునకు. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" అని భగవద్గీత. నీవు తిని చూచి రుచ్యము లటుంచు తెలియక నేనెట్లు తినగలుగుదునని స్వామి పలుకగా ప్రతి వృక్షమందున ప్రథమమందు నేను రుచి చూచియే తెచ్చినాను, ఫల ప్రకరము కుక్షి నిండినది, రామ! విరామము లేదు ప్రాణ నాయకా!.... ఆ ఫలముల్ తినవే దయామతీ! అని శబరి పలుకుటలో గల రహస్యము తన కర్మ ఫలములనురామచంద్రున కాత్మార్పణముగ నొసగుటయే.

విరామము లేక సాగిన జన్మ పరంపరలో ప్రతి జన్మ మునందున జీవత్వరుచి చూచియే వచ్చితిననియు, ఆ యను భూతి ఇక చాలుననియు, దయతో తన జన్మ కర్మల ఫలము లను స్వీకరించి తనకు జన్మ రాహిత్య స్థితి ననుగ్రహింపు మనియు శబరి ప్రార్థనలోని భా ము. ఇట్లు తన జన్మకర్మల

ఫలములను రామార్పణముతో దివ్యము గావించుకొనినది శబరి. ఇక శబరీ రాముల దివ్యార్థ సంభాషణమును గమనింతము.

## శబరీరాముల దివ్య సంభాషణము

ఫలాహారము ముగిసినది. పిదప శబరీ రాముల దివ్య సంభాషణ మారంభమగుచున్నది. ఈ ఘట్టమునందు రాముడు శబరి దివ్య జ్ఞానమును పరీక్షించుచున్నాడా! అనిపించును. ఇది శబరి కథ యందు ఆయువుపట్టనదగిన సన్నివేశము.

గీ॥ అవ్వ! నివ్వరి వెన్నులయట్లు ముగ్గు
బుట్ట వలె నయ్యె నీ శిరంబు ననంగఁ
బ్రభువ! నీ యాత్మ వాఁకిట రంగవల్లి
నినుచుటకు నింతగాఁగఁ బండిన దటంచు

గీ॥ అవ్వ! యెంతో తపించి నీ యాయు వెల్ల
నార్చి నీ విట్టులెండి యేకైతి వనఁగ
బ్రభువ! స్నేహంబు చేత నార్ద్రంబు చేసి
యింత దివ్వెగా వెలిగించవే యటంచు

గీ॥ అవ్వ! నీ కిట్లు తీవ్ర వ్రతాభిషంగ
మునను బ్రాణాలు గూళ్ళు వట్టిన వసంగ
బ్రభువ! నీ యింత తీవ్ర దయాభిషంగ
మునను బ్రాణమ్ము గూటఁ జేరిన దటంచు

శబరి పలికినది. 'తల ముగ్గుబుట్టయినది' ; 'ఎండి యేకై తివి' ; ప్రాణాలు గూళ్ళు వట్టుట' అనునవి అచ్చమైన తెలుగు జాతీయములు. కవితా వైభవ దృష్టితో నిందు ప్రతి బింబించిన తెలుగు జీవితము తెలుగు పాఠకులకు ఆనంద దాయకము.

'కల్పవృక్ష రహస్యము' లందు విశ్వనాథ యిట్లు చెప్పెను. "ఒక ప్రౌఢుడైన కవి శబ్దములు భాషలోననే యుండునుగాని యా కవి తన యొక్క ఆత్మ ద్రవ్యమున కనుకూలమైన శబ్దములను తెచ్చికొని ప్రోవువెట్టును. వాని యందొక వైలక్షణ్య ముండును. అందరికిని తెలియదు. శబ్ద ముల కూర్పుచేత నొక యేదో ధ్వని యుదయించును. ఈ ధ్వని కావ్యధ్వని కాదు. మహాకవి యక్కడ నున్నాడు. దానిని గ్రహించుటకు 'శబ్ద బ్రహ్మము' సాక్షాత్కరింప వల యును." (పు 80).

ఇటు బ్రహ్మము రెండు విధములు 1. శబ్ద బ్రహ్మము. 2. అర్థ బ్రహ్మము.

"ద్వేవిద్యే వేదితవ్యే శబ్ద బ్రహ్మ పరంచయత్
శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధి గచ్ఛతి
--బ్రహ్మ బిందూపనిషత్.

శబ్దబ్రహ్మోపాసన చేసి పరబ్రహ్మతత్త్వము నెరుంగ వలెను. ఇందు మనకు మొదట శబ్దమే ఆధారము, ప్రమాణము. శబ్ద జ్ఞానము చేతనే అర్థజ్ఞానము కలుగును.

దీనిని బట్టి విశ్వనాథ రామాయణమును సామాన్యార్థ దృష్టితో పరికించుట తగునా? శబ్దముల మాటున దాగిన కవి ఆత్మ ద్రవ్యమును పట్టుకొనవలెను. ఈ చూపుతో ప్రకృత మీ సంభాషణమును పరిశీలింతము.

శబరి శిరోజములు ముగ్గుబుట్టవలె నయ్యెనని రాముడు పలుకగా రాముని ఆత్మ వాకిట రంగవల్లి నినుచుటకే అంతగా పండినదని శబరి సమాధానము పైకి చమత్కారముగ కనిపించినను, ఇది యొక చక్కని ఊహా కల్పనము.

"మఱి నీ మాటలు నూహ చేసినను
సామాన్యార్థముల్గావు ని
ర్భర దివ్యార్థములై కనంబడెడు నవ్వా! యెవ్వరే
నీవు నీ

పరమోదార ఫలానుభూతిని శ్రమల్ వాసెన్........"
అనుచు రాముని చేతనే శబరి మాటలు సామాన్యార్థములు కావనియు, దివ్యార్థములై కనబడు నవియు స్పష్టము చేయించినాడు కవి.

వాల్మీకి మహర్షియు శబరిని సామాన్య పామర స్త్రీయని చెప్పలేదు. ఆమె విజ్ఞానవంతు రాలనియే పేర్కొనెను.

"ఏవ ముక్త స్స ధర్మాత్మా శబర్యా శబరీ మిదం
రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతాం
ద నో స్సకాశాత్తత్త్వేన ప్రభావం తే మహాత్మనః
శ్రుతం ప్రత్యక్ష మిచ్ఛామి సంద్రష్టుం యది మన్యసే"
-వాల్మీకి రామాయణము, 18-64-3

ఎంత మాత్రము విజ్ఞానము నందు త్రోసివేయుటకు వీలులేని శబరితో దనువు వల్ల నీ ప్రభావము యొక్క యాదార్థ్యమును తెలిసికొని యున్నాను. ఆ వినినది ఇపుడు ప్రత్యక్షమున చూచుచున్నాను.' అని శ్రీరాము డనెను. శబరి 'త్రికాల జ్ఞాన సంపన్నురాలని కొందరు వ్యాఖ్యాకారు లాపదమునకు అర్థమును వ్రాసిరి.

'ఇది విజ్ఞాన యుగము. పాశ్చాత్త్యులు ఆంగ్లభాష యందు 'సైన్స్' శబ్దము నేయర్థమున వాడుచుండిరో నేడు మనవారు విజ్ఞాన పదము నా యర్థముననే వాడుచున్నారు.'

"శాస్త్ర ప్రయోజన దృష్టిలో ప్రాక్పశ్చిమములకు భేదమున్నది. దైహిక దృష్టితో ఐహిక సుఖమును సాధించుట పాశ్చాత్య శాస్త్రాదర్శము. ఆత్మదృష్టితో ఐహికాముష్మిక సుఖములు రెంటిని సాధించుట భారతీయ శాస్త్రాదర్శము. ఇందలి పరమార్థ సత్యము యోగి హృద్ధ్యాన గమ్యములు కాని, భౌతిక పదార్థములవలె ప్రయోగాత్మకములు కావు"1 విజ్ఞాన మనగా విశిష్టమైన జ్ఞానము. అనగా భౌతిక విజ్ఞానము కంటె విశిష్టమైన ఆత్మ జ్ఞానమే విజ్ఞానమని మన భారతీయ విద్వాంసుల అభిప్రాయము.

వాల్మీకి రామాయణము నందలి ;'రాఘవః ప్రాహ విజ్ఞానేతాం నిత్య మబహిష్కృతాం' అను వాక్యమును బట్టి శబరి నిత్యమాత్మ విజ్ఞాన సమగ్నురాలనియె గ్రహింపవలెను. "విజ్ఞానే విషయే, అబహిష్కృతాం అంతరంగ భూతాం, జాత్యాహీనామ ప్యాచార్య ప్రసాద లబ్ధ బ్రహ్మజ్ఞానా మితి భగవతాప్యాదరణీయత్వో క్తిః" అని శ్రీమద్రామాయణ గోవింద రాజీయ వ్యాఖ్యానము. (పు. 525)

"ఆ వాల్మీకి యేది చెప్పినను నూటికి కోటికొకచోట చెప్పును. నేనాయనతో చావనా? నేనా గుణములను

1. శ్రీమహాభారత వైజ్ఞానిక సమీక్ష.- శ్రీ॥తి॥ వేం॥శ్రీనివాసాచార్యులు. పు. 9

బయటకు తీసి వ్యాఖ్యానము చేయుదును. ఈ రహస్యము శ్రీరామచంద్రుడు శబరి దగ్గర నెంతయో చూపించును." అని కల్పవృక్ష రహస్యము లందు విశ్వనాథయే చెప్పెను. (పు.68) కనుక ఆ వాల్మీకి మాధారముగ శబరి విజ్ఞానమును విశ్వనాథ కవితా రూపమున నెట్లు వ్యాఖ్యానము చేయుచున్నాడో గమనింతము.

1) ముగ్గు తెలుపు. శబరి శిరోజములు తెలుపు. తెలుపు సాత్త్వికలక్షణము. శిరోజము లనగా వెంట్రుకలని మాత్రమే కాదు శిరసు నుండి 'జ'=పుట్టినవి. 'భావము'లనియు అర్థము. శబరి భావములు సాత్త్వికములు. సత్త్వభావ సంపదచే మాత్రమే తెలియదగినది ఆత్మ తత్త్వము. ఆత్మారాముని తత్త్వమును తెలియగోరుచో పండిన సత్త్వభావములను ముందుగ ఆత్మతత్త్వ ప్రాంగణ రంగవల్లికను గావింపవలెను. పండబారిన సత్త్వ భావమున రామ (ఆత్మ) తత్త్వము గోచరించును. ఇది 'నివ్వరి వెన్నుల యట్లు శిరము ముగ్గు బుట్టువలె నయ్యె'నని రాముడనగా నీ ఆత్మ వాకిట రంగవల్లి నినుచుటకే అంతగా పండినదని శబరి చెప్పుటలోని రహస్యార్థము. కేశములు పండినంత మాత్రమున సరికాదు, భావము పండవలెను. ఇట శిరోజములను నివ్వరి వెన్నులతో పోల్చుటలో- "నీ వార శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా" అని ఆత్మ లక్షణమును దెలుపు శ్రుతి వచనము ధ్వనితము. ఇది

దివ్యార్థము. పైకి పండిన తలను వర్ణించుట సామాన్యార్థము. భావమున ఆత్మ తత్త్వమును జీర్ణించుకొన్న ఋషి వంటి కవి తప్ప ఇట్టి పద్యములు వ్రాయలేదు.

(2) ఇక- ఆయువెల్ల నార్చి తపించి యెండి యేకైతి వని శబరితో స్వామి పలికినాడు. ఆ యేకును స్నేహము (చమురు) చేత తడిపి 'దివ్వె'గా వెలిగించమని శబరి ప్రార్థనము. ఇది సామాన్యార్థము.

"రమణార్థమున రామ శబ్దమునకు బ్రహ్మానంద లక్షణము గలదు. తాను 'అహం బ్రహ్మాస్మి' అన్న స్థితిలోనున్నాడు రాముడు. కాని క్రియా వ్యాపార దృష్టితో మాయనే అనుసరించుచున్నాడు. ఆ మాయ చీకటి. అందులో సీత యొక దివ్వె...." అనుచు కల్పవృక్ష రహస్యము లందు విశ్వనాథ వివరించిరి.

శబరి పిలుపు రాముని ఆత్మలో పడినపుడు ప్రథమ దర్శనముననే 'శబరి కనులయందు స్వామి తాఁదన ప్రతిబింబ మరసి దార విరహ బాధ యెల్ల విడిచె'నట. అనగా సీతా తత్త్వము శబరీ తత్త్వము బింబ ప్రతిబింబము లన్న మాట. కనుకనే శబరి తనను 'దివ్వె'గా వెలిగించమని ప్రార్థించుటయే కాదు సీతాదేవి వలె ప్రాణనాథా! ప్రాణనాయకా! అనియు పిలచెను. కారణము సీత రాముని ప్రాణచయమే. అరణ్య కాండలో సీతారాముల అవినా స్థితిస సూచించు

"అతడు ప్రాణి. ఆమె ప్రాణంబు" అనిన అకంపనుని మాటలును, సుందర కాండలో "మదవతి నా ప్రాణచయము" అనిన శ్రీరాముని మాటలును నిట స్మరణీయములు.

ఇక, శరీర భ్రాంతి 'ఎండి' అనగా లోపించి 'ఏకత్వ సిద్ధి కలుగునంత వరకు భగవంతుని కొరకు తపించవలెను. తపించుట అనగా తపస్సు చేయవలెను. 'తప ఆలోచనే' అని నిర్వచనము 'ఆ_లోచనము' అనగా జ్ఞానలోచనముతో చూచుచు భగవత్తత్త్వమునకై ధ్యానము ద్వారా తపించవలెను. అపుడు సిద్ధించిన 'ఏకత్వము'న భగవంతుని స్నేహము లభించును. భగవంతుని స్నేహముతో గూడిన దివ్యజ్ఞానమే 'డివ్వే' యగును. స్నేహముతో నార్ద్రము చేసి దివ్వెగా వెలిగింపుమని శబరి శ్రీరామచంద్రుని కోరుటలోని దివ్యార్థమిదియే.

3) తీవ్ర వ్రతాభిషంగము వలన ప్రాణాలు గూళ్ళు పట్టినవని ప్రభువనగా, నీ యింత తీవ్ర దయాభిషంగముననే ప్రాణము గూట చేరినదని అవ్వ పలికెను. ఇది సామాన్యార్థము.

'గూడు' అనగా 'శరీరము'. మనము చాల అలసి వచ్చి యేదైన తినిన, త్రాగిన పిదప 'ప్రాణం గూటిలో పడింది' అనుకొనుట పరిపాటియే కదా! ఇట ఒకానొక తీవ్ర నియ

మానుసారమే ప్రాణములు గూళ్ళు అనగా శరీరము లందు చేరుచున్నవని స్వామి పలుకగా, ఈ గూడు చేరిన ప్రాణము భగవానుని తీవ్ర దయాభిషంగమున తిరిగి చేరవలసిన గూటు చేరినదని శబరి భావము. ఇట 'దయ' అనునది ఆత్మ గుణము లందు ప్రథమమైనది, ప్రధానమైనది.

"దయా క్షమాఽన సూయాచ శౌచమాయా సుదూరతా
మాంగల్యాఽకృపణత్వేఽస్పృహోష్టావాత్మగుణాః
స్మృతాః ।
- మనుస్మృతి.

ప్రాణము ఆత్మయందు లయమగుటకు ఆత్మ స్వరూపుడైన రాముని దయ ప్రధానమని యిందలి కవి భావము.

శబరి గురుభక్తి : శబరి యొక్క యిట్టి విజ్ఞాన వాక్ ఫలానుభూతితో రాముని శ్రమలు వాసెను. శబరి యిట్లు చెప్పుచున్నది. రామలక్ష్మణులకు స్వాగతి నెఱపిన పిమ్మట తన వెంట రమ్మని చెప్పి తన గురువైన మతంగముని దివ మున కేగెనట. ఆ ముని వియోగ క్లేశము రామ దర్శనముచే బాసినదని చెప్పుచు- "నా దైవంబగున్ మౌని.... ఆ పవిత్ర మూర్తియే నిన్ను నాకు తెలియ జేసెను. వేద ప్రతిపాదిత పరబ్రహ్మ తత్త్వమును ఆ మహర్షి యుపదేశించెను. అదియే

భవన్మూర్తియై నేడేతెంచెను' అనుచు శబరి జ్ఞానవతియై ప్రసంగించి ఆ మహాముని తన పరిచర్య లేకుంటచే నచ్చట అలమటించుననియు

"సిద్ధముగ నున్న యగ్నిలోఁ జేర్చి మేను
చనియెదను నన్ననుగ్రహించవె! కృపాళు"

అని రాముని అనుగ్రహమును కోరినది.

"నీకు మౌని మీఁద నీ మీఁద నాకును
వలపుఁ బొంతనములు పలువిధములు"

అనినాడు స్వామి. అపుడు

"శబరి యిట్టులనియె జలధికి గౌతమి
మీఁద నెంతొ శబరి మీఁద నంతె
జలధిరాజు భర్త శబరి లజ్జావతి
గోద వెనుక దాఁగి కొనియె పొందు"

ఇచట కవి విశిష్టాద్వైత మత సూత్రము నొకదానిని చెప్పుచున్నాడు ఆచార్య కటాక్షము లేనిదే భగవత్తత్త్వమును తెలియ లేరు. భగవత్తత్త్వము ఆచార్యుని (గురువు) ద్వారా మాత్రమే పొందదగినదని సంప్రదాయము. శబరి అట్లే పొందినది. ఈ సంప్రదాయ ప్రతిపాదనముచే విశ్వనాథ సంప్రదాయ వేదియైన విద్వత్కవి యని తెలియనగును. అట్టి వాని కవిత వేదమంత్ర సమమట.

"సంప్రదాయాగత జ్ఞాన సహితుడైన
మనుజు సత్కవితయు వేదమంత్ర సమము"

అని సంకీర్తన లక్షణమున (పు. 23) తాళ్ళపాక చిన తిరుమలా చార్యుడు చెప్పెను.

సాక్షాత్పర బ్రహ్మ స్వరూపుడైన శ్రీరామచంద్రు డెదుగ నున్నను తన గురు మార్గము ద్వారా మాత్రమే ఆ భగవానునితో పొందు అని చెప్పిన శబరి గురుభక్తి ప్రశంస నీయము రాముడు జలధి వంటివాడు. జలధికి అనుగ్రహము 'గౌతమి' మీద నెంతో 'శబరి' మీద కూడ నంతే యుండును గనుక సక్రమ మార్గముననే తన గమనమని స్పష్టముగ చెప్పినది శబరి. గౌతమికి శబరి ఉపనది యగుట గమనింపదగినది. ఇది యొక కవితా సౌందర్యము. ఇట 'గౌతమి' మరెవరో కాదు శబరి గురువగు 'మతంగ మునియే'.

జ్ఞాన - విజ్ఞానములు : "సృష్టి మార్గము 'సంచరము' ముక్తి మార్గము 'ప్రతి సంచరము. సంచరము విజ్ఞాన మార్గము. ప్రతి సంచరము జ్ఞాన మార్గము. "బ్రహ్మై వేదం సర్వం" అన్నది సృష్టిరూప విజ్ఞాన మార్గము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నది ముక్తిరూప జ్ఞాన మార్గము. రెంటి సమన్వ యము వలన బ్రహ్మ జ్ఞానము పూర్ణమగును" అని 'అనుశ్రుత వైజ్ఞానిక' శ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ బ్రహ్మ

విజ్ఞాన పరిచయమను గ్రంథమున (పు. 213) తెల్పిరి. "జ్ఞానం విజ్ఞాన సహితమ్"- "జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా" అని భగవద్గీత. ఇవి సంచర ప్రతిసంచరములే కనుక జ్ఞాన-విజ్ఞానములందు ఒకటి తెలిసిన మరొకటి వచ్చును. గురు కృపచే శబరి విజ్ఞాన మార్గము ననుసరించెను. ముక్తిరూప జ్ఞానదాతయై రాముడే స్వయముగ శబరి చెంతకు వచ్చెను.

"అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలం
కృత్వా జ్ఞానం స్వయం వశ్యే జ్జలం కతకరేణువత్"

అజ్ఞాన మనెడి కలుష జలమును విజ్ఞాన కతక ఫలముచే నిర్మలము గావించు కొనవచ్చును. జ్ఞానముతో సమానమైనదియు, దాని కంటె పవిత్రమైనదియు వేరొకటి లేదు. అట్టి ఈశ్వరీయ జ్ఞానముచే పరమ శాంతి లభించును.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధి గచ్ఛతి".
— భగవద్గీత.

ఏ ముని పరిచర్యచే తనకు విజ్ఞానము, తద్వారా ఆత్మ సాక్షాత్కారము కలిగినదో ఆ ముని మార్గముననే తాను చరించి తరించుటకు రాముని అనుజ్ఞ కోరినది శబరి. 'సిద్ధముగనున్న అగ్నిలో జేర్చి మేను చనియెద' నన్నది. ఈ యగ్ని భౌతికాగ్ని కాదు. జ్ఞానాగ్ని. "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మ

సాత్కురుతేఽర్జున" అని గీతలో చెప్పబడినట్లు ఆత్మ విజ్ఞానముతో సర్వ కర్మ ఫలములను భగవంతునకు సమర్పించి జ్ఞానాగ్నిలో దైహిక కర్మలను, దేహ భ్రాంతిని పూర్ణముగ దగ్ధము గావించుకొనినది శబరి. ఆమె నొక మహాభక్తురాలుగ మాత్రమే లోకము గుర్తించినది కాని ఒక విజ్ఞానవతిగ, జ్ఞానవతిగ దెలిసిన వారరుదు.

"విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్"

అన్నవాడు ఆదికవి వాల్మీకి మహర్షి ఒకడు. "నీ మాటలు నిర్భర దివ్యార్థము" లనుచు శబరి నొక దేవతారూపమైన దీధితిగా గుర్తించిన వాడు విశ్వనాథ ఒకడు. విశ్వనాథ దృష్టిలో సృష్టిలో శబరి భక్త శబరి మాత్రమే కాదు జ్ఞాన-విజ్ఞానములు ఏకత్ర నిలచిన బుద్ధి యోగ శబరి.

"ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సార కథా కథన మొక్క చాయన నడచున్
వారంతర్దృష్టులు బహు
ధారూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ॥

- కల్ప వృక్షము

భారతీయ ఋషుల అంతర్దృష్టృత్వము సూక్ష్మతరేక్షణమున మాత్రమే సుసాధమని విశ్వనాథ వారి సూచనము.

<u>ఛందో వైవిధ్యము</u> : శబరి ప్రసంగమున విశ్వనాథ భద్రకము, జలోద్ధతగతి, తరళము, విభూతి వంటి భిన్న వృత్తములతో ఛందో వైవిధ్యమును ప్రదర్శించెను.

"మౌని వేది యిది చూడవే
దీనఁ బుష్పతతి వాడవే
మౌని నాఁడు విడియేగనే
సూన కాంతి యిటు సాగెనే"

ఇది భద్రకము. ఇది మునీశ్వరుని యజ్ఞ వేది యనియు; వేది అనగా తెలిసినవాడు, జ్ఞాని అని యర్థము. అచటి పుష్పతతి వాడిపోదని, మౌని యేగినా వాని జ్ఞాన తేజము మంగళకర మైనది, భద్రమైనదని తెల్పు శబరి భావమును భద్రిక వృత్త మున దెల్పుట సమంజసము. మరియు 'భద్రకమ'ను పేరుగల యజ్ఞవేదియు కలదట. దీనిని భద్రక వృత్తముచే ధ్వనింప జేయుట విశేషము.

ఇట్లే మునీంద్ర యాగ పతిరక్షణార్థము పయశ్శ్లధ శరీరులైన మునుల వాంఛను బడి పృథియాతములైన సప్త పయోధులను గూర్చి తెల్పునపుడు 'జలోద్ధతగతి' వృత్తమున ప్రయోగించెను. ఇది 12వ జగతీచ్ఛందము లోనిది. 11ః వృత్తముగ అనంతుడు దీనిని పేర్కొనెను.

తరళమనగా హారమధ్య రత్నమనియు, ప్రకాశ మనియు అర్థము. ఈ క్రింది తరళ పద్యమును చూడుడు.

"పరముఁడాముని నా హృదంతర భావనామయుఁడై చనన్
పరముఁడీవును నా హృదంతర భావనా మయుఁడై చనన్
పరముఁడాముని వెంటఁ బోవఁగ భావమందున నెంచెదన్
పరముఁడీవు ననుగ్రహింపగఁ బందితిన్ త్రిదివంబునన్॥

ఇందు శబరి తన గురువునకు రఘురామునకు అభేదము చెప్పుచున్నది. భావతః గురు మార్గమున పోవుచో రాముని అనుగ్రహము కలిగి స్వర్గము జేరవచ్చునని శబరి భావనము. రాము డచ్చముగ పరబ్రహ్మ తత్త్వము. ఈ తత్త్వము హృదంతర భావనామయుడైన గురువు ద్వారా తెలియ నగును. మతంగుని సేవ చేసి విజ్ఞాన సాధన గావించిన మానసిక వృత్తి శబరి కనుక ఆ ప్రవృత్తి ఆత్మ తత్త్వము నెరిగి ముక్తిరూప జ్ఞాన మార్గము ననుసరించుచు స్వర్గమును పొందును. స్వస్వరూపమును పొందుటయే స్వర్గము. ఇదియే మోక్షము. కర్మ బంధములు సర్వము త్రెంచుకొనిన గాని లభించనిది మోక్షము. "కౌసల్య ముక్తి కాంతా సమానాకార"

అయినపుడు తత్త్వనయుడు రాముడు మోక్ష స్వరూపుడు, ముక్తి ప్రదాత. రామ దర్శనానంతరము శబరి మోక్షమును పొందినది. హృదంతర భావనలో ప్రకాశితమగు నీ పరమార్థ మును ప్రకాశార్థకమైన 'తరళ' వృత్తములో వ్రాయుట విశేషము.

తరువాత నొక విభూతి వృత్తము.

"అ యెడన్ మునీశ్వరుండీ యెడన్ రఘూత్తముం
డాయెడన్ రఘూత్తముండీ యెడన్ మునీంద్రుడున్॥

ఇందు తన గురు రఘు రాముల అద్వైత స్థితిని చెప్పినది శబరి. అద్వైతము భావనా మాత్ర గమ్యము. కల్పవృక్షము నందు ఆత్మ పదార్థము స్థాపింపబడి అద్వైతము నిరూపింప బడినట్లు విశ్వనాథయే తెల్పెను. ఇటు రఘూత్తముడు హరి; ఈశ్వరుడు హరుడు. 'మునీశ్వర' పద ప్రయోగముచే నిందు హరిహరాద్వైతము గూడ నిరూపింపబడినట్లయినది. ఇట్టి అద్వైత సిద్ధి యొక మహా విభూతి, మహైశ్వర్యము. ఇట్టి విభూతిని సూచించుటకే కవి 'విభూతి' వృత్తము నిట స్వీక రించెను.

వృత్తము నెన్నుకొనుటలో గూడ కవి ప్రతిభ యుండును. దానిని 'వృత్తౌచిత్య' మందురు.

షట్పదీ నినాదము : (శబరి రామస్తుతి) శ్రీరాముని సవిశేషాకృత దర్శనముచే నిర్వృత్తి పొందుచున్న శబరి శ్రీరామచంద్రుని దివ్యత్వమును షట్పదీ నినాదమున కీర్తించుచు అగ్ని ప్రవేశము గావించెను. ఇట షట్పద మన్నందులకు కవి ద్విపద, త్రిపద, చతుష్పద, పంచపద, షట్పద ఛందములను క్రమముగ రచించి సాధనలో జీవుని అధిరోహణ క్రమమును సూచించెను. మరియు షట్పద శబ్దముచే భ్రమర కీటక న్యాయ మీ సందర్భమున స్మరింప దగి యున్నది. ఈ షట్పదులు శబరి ఆత్మ విజ్ఞాన విహారము నకు ఉద్యాన వనులు. వీని యందు విశ్వనాథ శ్రీరాముని పరాత్పర తత్త్వమును ప్రత్యక్షము చేసెను. ఉదాహరణము నకు కొన్ని-

"రఘు కులాంబుధి చంద్ర రాజీవ నేత్ర
యఘు విచారణ శీల యానందమూల....

శంకద్వినిశ్చల స్వాంత పయోధి
నోంకార శేష పర్యంకంబు నందు
నిద్దుర కానట్టి నిద్దుర పోవు
పెద్దవు పిన్నవై పేర్చిన సామి!....

మౌనీంద్ర యోగ సంపన్నిరూపిత మూర్తి
నానా త్రయీ శిఖావర్తి

దానితా శ్రిత జనతార్తి
ఉపనిష దుదిత దివ్యోపాసనాసాధ్య
జప హోమ శమ దమారాధ్య
కృపణాభి యోగ నేపథ్య

యజ్ఞాంతస్తత్వా ! అమృత కళా
ప్రజ్ఞాద్యాకారా ! ప్రమాదశా
అజ్ఞేయాధి నిధన! అచ్యుత! జ్ఞే
యజ్ఞాత్మ జ్ఞానాయన భూతా!....

ఉపర్బుధ ధరానిల కృపీటు వ్యోమానితర తనూ భూమ
వృష పుణ్య తపోదాన నియమ శ్రీయోగ రూపాత్మసీమ
దృషద్భూతాఘ సంతాన నిర్మిత లోకచయ దుఃఖ పుంఖ
ఝష కేతన మహోర్చిళారూఢ జంతు ప్రతారణారింఖ.

ఇట్లు సాగిన శబరి రామస్తుతిలో నెంతటి పారమార్థిక విజ్ఞానము ప్రకాశించు చున్నదో ఆత్మజ్ఞు లెరుంగ గలరు.

శబరి కథ చిత్రము : రామాయణ కల్పవృక్షము నందు శబరితో రాముడు చిత్రముగ ప్రసంగించినట్లు కలదు. 'శబరి కథ మఱిన్ మఱి చిత్రమైన' దని సౌమిత్రియు పలికెను. ఈ చిత్రపద ప్రయోగము నందొక రహస్యము కలదు.

'చిత్' సంబంధమైనది 'చిత్రము' తత్త్వములు మూడు. 1 చిత్ 2. అచిత్ 3. ఈశ్వరుడు. "భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్త్వా" అని శ్రుతి వాక్యము. చిత్ = అనగా జీవుడు, భోక్త; 'అచిత్' అనగా ప్రకృతి. ప్రేరిత అనగా ఈశ్వరుడు. ఇందు 'చిత్' అనబడు జీవుడు నిత్యుడై, అణువై, జ్ఞానానంద లక్షణుడై, జ్ఞాన గుణకుడై, ఏక రూపకుడై, శేష భూతుడై యున్నాడు. స్వభావముచే జ్ఞానానంద లక్షణుడైన జీవుడు కర్మవశమున నేర్పడిన యీ ఉపాధి (శరీరము)ను ఆశ్రయించుటను బట్టి స్వస్వరూప జ్ఞానమును పోగొట్టుకొని యున్నాడు. గురు కృపచే మరల ఆ జ్ఞానమును పొందుచున్నాడు.

'అచిత్' అనునది గుణత్రయాత్మకమై, నిత్యమై, విభువై పరిణామమును పొందునదై యున్నది. ఇట్టి ప్రకృతి యందు భోగ్యతా బుద్ధి యుంచుట వలన జీవునకు సంసార మేర్పడు చున్నది. ఈ బంధమును విడిపించుకొనదలచిన జీవుడు "సంసార బంధ స్థితి మోక్ష హేతుః" అని భగవంతుని ఆశ్ర యింప వలసి యున్నది.

'ఈశ్వరుడు' సమస్త కళ్యాణ గుణాత్మకుడై అవాప్త సమస్త కాముడై, విభువై, చేతనా చేతనములు శరీరముగ గలవాడై వానిచే ఆశ్రయింప బడినవాడై యున్నాడు. అట్టి

భగవ దవతారములు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములని ఐదు విధములు. శ్రీ వైకుంఠములో దివ్య మహిషీ పరిజన పరిచారికా భక్త భాగవత సహితుడై యుండునది పరము. క్షీర సాగర శాయియై సృష్టి స్థితి కారణ నిర్వహణకై సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధాత్మకమైన మూర్తి త్రయాత్మకుడై యుండునది వ్యూహము. రామకృష్ణా ద్యవ తారములు విభవావతారములు. సకల జీవ హృద యాంతరాళముల అంతర్యామిగ నుండునది అంతర్యామి. దేవాలయము లందు శిలారూపమున వేంచేసి యుండునది అర్చావతార రూపము.

ఇందు విభవతార పురుషుడైన శ్రీరాముడు చిద్రూప (జీవరూప) శబరితో తత్సంబంధిత ప్రసంగము గావించెనని తెల్పుటకు 'చిత్ర ప్రసంగ' మనియు; జీవుని కథ చిత్రమే కనుక శబరి సేవ మఱిన్ మఱి చిత్రమైనదని సౌమిత్రిచే పలి కించుటయు విశ్వనాథ తాత్త్వక ప్రతిభకు నిదర్శనమని గుర్తింపవచ్చును.

<u>అవ్యయుని పంచకళలు - శబరి :</u> శ్రీమదవ్యయ పరమాత్మని పంచ కళలైన ఆనంద విజ్ఞాన మనః ప్రాణ వాక్కులు శబరి పాత్రలో సంగమించినవి.

పంచ కళలు

| నిస్తారము (ముక్తి) | | | సంసారము (బంధము) | |
| --- | --- | --- | --- | --- |
| ఆనంద | విజ్ఞాన | మనః | ప్రాణ | వాక్కు (శరీరము) |

ఇందు మనసు మధ్య స్థానము నందు కలదు. ఇది ఉభయాత్మకము. "ఉభయాత్మకం మనః" అని శ్రుతి. ఈ మనసు ఇటు ప్రాణవాక్కు లందును, అటు విజ్ఞానానందము లందును కూడ సంచరించును. మనసు ప్రాణ శరీరముల వైపు సంచరించినచో ఆనంద విజ్ఞానములు వానికి సహకరించును. అపుడు విషయ వాంఛలు. భౌతిక సుఖములు, సంసారము, బంధనము ప్రాప్తించును. అదే మనసు విజ్ఞాన- ఆనందముల వైపు సంచరించినచో శరీర ప్రాణములు వీనికి సహకరించును. మనసు విజ్ఞానము నందు లగ్నమైనపుడు ఆనందము కలుగు చుండును. ఇది జ్ఞానానందము. దీనినే ఆత్మానందము, బ్రహ్మానంద మందురు. యోగులు విజ్ఞాన మూలక బ్రహ్మానందాను భూతిని పొందుచు జీవన్ముక్తులగు చుందురు. 1

1. వివరమునకు చూడుడు నా "అన్న విజ్ఞానము"-పు. 60, 61

యోగినియైన శబరి శరీర భ్రాంతిని విడచి మనసును ఆత్మ విజ్ఞానము నందు సంచరింప జేసి బ్రహ్మానందమును పొంది ముక్తి గాంచినది. ఆనందమయ విజ్ఞాన గర్భిత మగు నామె మనస్సునకు ఎండిన చెట్టువలెనై యుండి కూడ ఆమె శరీరము, ప్రాణములు సహకరించినవి. ఇది శబరి తపస్సాధనా విశేషము.

దీనికి ప్రోద్బలకముగ నున్న; బ్రహ్మజ్ఞులు శ్రీ వావిలి కొలను సుబ్బారావు గారు రచించిన ఈ క్రింది పద్యమును పరికింపుడు.

"ఒదవెడు నవ్యయంబగు ననుత్తమ లోకములంచుఁ
జెప్ప స
మ్మదమెదఁ గ్రమ్మ నీ కొఱకు మంచివి మంచివి యేఱి
కోరిపె
క్కుదెగల వన్య సంతతులఁ గూరిచి యుంచినదాన; నన్న ని
ర్వ్యదళిత వైరి జ్ఞాన పదవీ పరిణద్ధ దృఢాత్మమానసన్
శ్రమణిని గాంచి యిట్లనియె....

- శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము. (అ. కాం

ఇందు 'జ్ఞాన' పదవీ పరిణద్ధ దృఢాత్మ 'మానస'యట శబరి. ఆమెకు 'అవ్యయ సంబంధమైన ఉత్తమోత్తమ లోకము లొదవునట. అనగా అవ్యయేశ్వరుని ఆనంద సంబంధమైన ఉత్తమ లోకము ఒదవునని సూచ్యము గావింప బడినది.

## ద్యులోక దీధితి శబరి :

శబరి శబర జాతికి చెందిన సామాన్య స్త్రీ కాదు. కారణ జన్మురాలు, యోగిని. యోగిని మాత్రమేకాదు, ఒక దేవతా రూపమైన దీధితి. ఈదీధితి ద్యులోక సంబంధమైనదని విశ్వనాథ వారి భావన.

"భూమి మీఁదను భూతముల్ పుట్టి వృద్ధి
పొందును ద్యులోకమున వృద్ధి పొంది పుట్టు
కానిపించుచే శబరియుఁగానిపించె
దివ్య మాల్యాను లేపనాది నవమూర్తి॥

ఒక యనిర్వచనీయమౌ నూహ చేత
ఆమెయే యీమె యనిపించు టంతె గాని
దేవతా రూపమైన యీ దీధితికిని
యోగినీ రూప కామెకు నుద్ది లేదు॥

యోగిని యైన శబరిలో ద్యులోక సంబంధమైన దేవతా దీధితిని దర్శించి ప్రదర్శించినాడు విశ్వనాథ. ద్యులోక సంబంధమైన దీధితి అనగా సూర్య సంబంధమైన జ్యోతిగ విశ్వనాథ ఊహించెను. ఈ సూర్య జ్యోతి ఆత్మజ్యోతియే. "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః"– "అంశో నానావ్యపదేశాత్"– ఇత్యాది భగవద్గీతా బ్రహ్మసూత్రాది శాస్త్ర వచనానుసారము జీవేశ్వరులు ఒకే అంశకు చెందిన వారు కాన శబరీ రాములు సూర్య సంబంధమైన ఏక తేజః ప్రసారములుగ గ్రహింపవలెను. ఆత్మ జ్యోతి వేరు, ఉపాధి యైన శరీర రూపము వేరు కావుననే విశ్వనాథ "దేవతా రూపమైన యీ దీధితికిని, యోగినీ రూపకామెకు నుద్దిలేదు" అనెను.

ఆత్మ సూర్యుని నుండి వచ్చి ఉపాధి అయిన శరీరము నందుండి అనుభవించి తిరిగి మరల సూర్యునిలో చేరును. "నూనం జనాః సూర్యేణ ప్రసూతా" అని శ్రుతి. సూర్య లోకమే స్వర్గము. "స్వస్వరూప గమనమేవ స్వర్గమ్". తన స్వరూపము (స్వ అనగా ఆత్మ అనియు అర్థము) అచటిది. అనగా సూర్యుని నుండి వచ్చినది. మరల దానిని అధిగమించుటయే అనగా పొందుటయే స్వర్గము చేరుట. మనలో నెవరైన చనిపోయినచో 'స్వర్గస్థు' లైరి అనుట

సంప్రదాయము. లోక వ్యవహారము నందీ వాక్యము మిగిలి నది, దాని పరమార్థము, అసలు తత్త్వము లోపించినది.

శ్రీ మహాభారతము కూడ స్వర్గావరోహణముతో ప్రారంభమై స్వర్గారోహణ పర్వముతో ముగియు చున్నది. "ఎచ్చట పుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణి కోటికిన్" అని భాగవతము చెప్పుచున్నది. పరిశీలించి శ్రద్ధగ సమన్వయింప జేసికొనినచో ప్రతి వ్యక్తికిని భారత భాగవత రామాయణములతో సంబంధము గలదని తత్త్వవేత్తలు, ఆత్మ విజ్ఞానులైన పెద్దలు చెప్పుచున్నారు.

ఆత్మ రూపుడైన రాముని దర్శనముతో శబరి ఆత్మ సాక్షాత్కారమును పొంది ముక్తి గాంచి స్వర్గము అనగా సూర్య లోకమున కేగి సూర్యతేజము నందు లీనమైనది. ఇదంతయు ఒక అనిర్వచనీయమైన ఊహ ద్వారా తెలియును. విశ్వనాథ అట్లే ఊహించి శబరి నొక దేవతా రూపమైన దీధితిగా శ్రీ మద్రామాయణ కల్ప వృక్షము నందు ప్రదర్శించెను.

ఇంతటితో శబరి కథ ముగిసినది. ఈ కథతో అరణ్య కాండయు ముగిసినది. అరణ్య కాండ ఉపాసనా సంబంధము గలది. దీనికి ముక్తి కాండ అనియు పేరు కలదు. శబరి

ఉపాసనా విధాన మిందు విదితము గావించబడినది. శబరి జ్ఞానోపాసనా విధానము ముక్తిదాయకము. ఇట జ్ఞానమనగా ఆత్మ విజ్ఞాన మనియే అర్థము. భౌతిక విజ్ఞానము నెంత సాధించినను, ఆత్మ జ్ఞానము లోపించినచో తానెవరో, తానె చటినుండి వచ్చెనో, మరల నెచ్చటికి పోవలసి యున్నదో తెలియకుండగనే పోవు ప్రమాద మున్నది.

విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షములో ఆత్మ పదార్థము స్థాపింపబడినది.

"ఉపక్రమోప సంహారావభ్యాసోఽపూర్వతాఫలమ్
అర్థవాదోపపత్తీచ లింగమ్ తాత్పర్య నిర్ణయే॥"

"ఒక కావ్యము నందు ప్రధానముగ నిర్దేశింపబడు మహా విషయమును నిర్ణయించుట యెట్లు? అని ప్రశ్నించి దానికి ఆరు గుర్తులు కలవని విశ్వనాథ కల్పవృక్ష రహస్యము లందిట్లు చెప్పెను.

1. ప్రారంభించుట 2. అవసానము చేయుట 3. మాటి మాటికి దానినే చెప్పు చుండుట. 4. ఉపకథలు దానిని గురించియే సంతరించుట 5. అది యొక క్రొత్త విషయమై యుండుట, ఆరవది చెప్పనక్కరలేదు.

ఈ కావ్యము దశరథునితో మొదలు పెట్టలేదు. మనువుతో మొదలు పెట్టలేదు.

"ఆత్మ నిత్యమ్మ కాలాద్య వచ్ఛిన్నము
సచ్చిదానంద సంపచ్చయమ్ము...."

అనుచు ఆత్మ పదార్థముతో మొదలు పెట్టబడినది. ఆత్మ పదార్థమే కల్ప వృక్షమున మాటి మాటికి చెప్పబడుచున్నది. ఉప కథలు దానిని గురించియే సంతరించుట, అది యొక క్రొత్త విషయమై యుండుట అను లక్షణములకు ప్రబలోదాహరణ మీశబరి కథయే.

"ఈ సంసార మదెన్ని జన్మలకు గానీ మౌని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణమ్ము దీర్ప గలదా? సత్కావ్య
నిర్మాణరే
ఖా సామగ్రి ఋణమ్ము దీర్ప గలదా....?

అని విశ్వనాథ వారి సంశయము! వాల్మీకి మహర్షియందు వారికి గల గౌరవ మట్టిది. కవితా రూపమున వాల్మీకి హృదయము నావిష్కరించు నిట్టి విజ్ఞాన వ్యాఖ్యానములు ఋషి ఋణమును దీర్ప సమర్థము లనుట నిస్సంశయము.

శబ్ద బ్రహ్మాఖ్యమైన పరిమళముతో శ్రీ మద్రామాయణ కల్పవృక్షమును సంపూర్తి చేసి_

"సద్యో నిర్గతమైన సర్వ కవితా సంభారమున్నీకు నై
వేద్యం బిచ్చితి రామచంద్ర! ప్రభువా విశ్వాసముంబూనవే
యాద్యం బైచను జీవ లక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును సారింపంగదే
గుండియన్॥

అనుచు శ్రీరామచంద్రుని మోక్షము కొరకు ప్రార్థించిన రామభక్తుడు విశ్వనాథ సత్యనారాయణ "కవితారూప తపస్సు చేసెదను శ్రీ కంఠా!" అను ఉత్కంఠను ప్రదర్శించిన విశ్వనాథ ఆధ్యాత్మిక తపస్సు యిది. ఇందు కవి కోరినది మోక్ష ఫలమే కనుక కావ్య ప్రయోజనమును అదియే యని నిర్ధారణము.

"కావ్య కళా తత్త్వ దృష్టితో చూస్తే ఆంధ్రభాషలో వెలువడిన రామాయణా లన్నింటిలోను అగ్రతాంబూలం అందుకొనే మహా కావ్యం రామాయణ కల్పవృక్షం" అని సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయము.

(విశ్వనాథ శారద. ప్ర. భా. పు. 282)

తత్త్వ దృష్టితో పరిశీలింపగా శబరి పాత్రలో కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ లీనమయ్యెను. శబరి వలె విశ్వనాథయు రామ తత్త్వము నందు అద్వైత

సిద్ధిని పొంది నాడనిపించును. శబరిలోని మధుర భక్తి విశ్వనాథ వారిది. శబరిలోని జ్ఞానార్తి విశ్వనాథ వారిది. శబరిలోని ఉపాసనా విధానము విశ్వనాథ వారిది. విశ్వనాథ శబరిలోని ఈ నిగూఢ తత్త్వము ప్రతి జీవునిది.

## ఫల శ్రుతి

శబరి జ్ఞాన నిరతి సకలంబు శ్రద్ధతో
వినిన చదివిన కథ విస్తరించి
తెలిసి కొనిన ప్రజకు దివ్య తేజశ్శక్తి
భక్తి తత్త్వ సిద్ధి ముక్తి కలుగు॥

ఓమ్ తత్ సత్.

* * *

ఇతి శ్రీమదాంగిరస పౌరుకుత్స త్రిసదస్య త్రయార్షేయ
ప్రవరాన్వితేన శఠమర్షణ గోత్రేణ ఆపస్తంబసూత్ర
పవిత్ర శ్రీమాన్ శ్రీమత్తిరుమల సుగుణావతీ
వేంకట శ్రీనివాసాచార్య పుణ్య దంపత్యోః
చతుర్థ పుత్రేణ వేంకట రాజాగోపాలాచార్య
శర్మణా విరచితః "విశ్వనాథ శబరీ -
విజ్ఞాన వ్యాఖ్యా" గ్రంథోఽయం
సమాప్తిం నీతః.

ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ 61-M-1-G-A
శ్రీ భాష్యం అప్పలాచార్యులు పీలానగర్
విశాఖపట్టణము-12

శ్రీరామశ్శరణం మమ

# మంగళా శాసనము

శ్రీమాన్ రాజగోపాలాచార్యుల వారు నాయందుగల విశేషాదరముచే విశ్వనాథ కల్పవృక్షము నందలి శబరీ రహస్యాన్ని స్వయంగా వినిపించి ధన్యునిగా చేశారు.

ఉపనిష ద్విజ్ఞానము, వేద రహస్యము, సాంఖ్యయోగ రహస్యములు తెలిసినవారికి కాని శ్రీరామాయణ భారతములు అంతు పట్టవు. అవి కూడ పంచకోశాత్మకముగా వెలసి ఉన్నాయి. అవి అజ్ఞ ప్రాజ్ఞ విశేషజ్ఞులకు సాధారణమైనవి. కావలసిన దానిని వారు గ్రహించి తృప్తి పడుచుందురు.

శ్రీ విశ్వనాథ వారు సాధనగలవారు, ద్రష్టలు, జ్ఞానులు, ఉపాసకులు కూడ. కనుక వారి గూఢమగు రామాయణాన్ని సామాన్యులు అర్థం జేసుకోలేరు శ్రీమాన్ రాజ గోపాలాచార్యుల వారు వారి పితృపాదుల కటాక్షంచే పరిశీలించిన అంతర్దృష్టి కలవారు. కనుక విశ్వనాథ వారి శబరిని

చూడగలిగారు. శబరీ రామ సమాగమంలో ఆత్మ పరమాత్మ సమాగమంలో ఉండే సౌందర్యాన్ని, రాసిక్యాన్ని వారు దర్శించగలిగారు.

దీనిని వాల్మీకి "విజ్ఞానమున అబహిష్కృత" అని ఒక్క మాటతో సూచించాడు. బృహదారణ్యకంలో ఆత్మ శబ్దానికి పర్యాయంగా విజ్ఞాన శబ్దాన్ని ప్రయోగించారు. "య ఆత్మని తిష్ఠన్" అని ఒక శాఖలో ఉంటే, వేరొక శాఖలో "యో విజ్ఞానే తిష్ఠన్" అని ఉన్నది. అందుచే విజ్ఞాన మనగా ఆత్మ. మనమందరము కర్మవశమున విజ్ఞానము నుండి బహిష్కృతులమైనాము. ఆమె విజ్ఞానములో నిలచియున్నది. స్వస్వరూపావిర్భావమే మోక్షమని "స్వేన రూపేణ అభినిష్పద్యతే" అని ఉపనిషత్తు పేర్కొన్నది. ఈ స్వరూపము శబరిలో వాల్మీకి దర్శించినాడు, ఒక్క పదముతో ఆవిష్కరించినాడు.

శ్రీ విశ్వనాథవారు దానిని దర్శించి ఆ ఆనందము ఇముడక బహుముఖముగా ఇందావిష్కరించినారు. ఈ యాత్మ సంబంధిని యగు రసదృష్టిని అనుభవించిన మధుర భక్తి భావముతో మేళవించినారు. అందు యోగమును మధ్యలో చేర్చినారు. వైరాగ్యమును పండించినారు. ఇట్లు జ్ఞాన భక్తి వైరాగ్య యోగముల సమ్మేళనముతో సాగిన శబరీ రహస్య తత్త్వాన్ని దర్శించి అనుభవించి, ఆవిష్కరించిన శ్రీమాన్ రాజగోపాలాచార్యుల వారు ధన్యులు.

"ఆచార్యవాన్ పురుషోవేద" అనే ఉపనిష త్సత్యాన్ని శబరి ప్రకటించినది. జీవుడు భగవంతుని వరించుట కాదు. భగవానుడే జీవుని వరించి కామించవలెనని "యమే వైష వృణుతే తేన లభ్యః" అను ఉపనిష ద్రహస్యాన్ని మన్మథ బాణ ప్రయోగముతో లోకానికి స్పష్టం చేశారు. ఇట్టి ఉపనిష ద్రహస్య వివరణమైన శబరీ రహస్యాన్ని "ఏకస్స్వాదు నభుంజీత" అని తామొక్కరే అనుభవించలేక లోకానికి అందించి ధన్యులైన శ్రీమాన్ రాజ గోపాలాచార్యుల వారిని అధికారం లేకపోయినా ఆనందమాపుకొనలేక అభినందించు చున్నాను.

ఈ విధంగా విశ్వనాథ వారి కల్పవృక్ష రహస్యాలను దర్శించి లోకానికి అందించేలా వారిని శ్రీ సీతారామ చంద్ర ప్రభువు అనుగ్రహించుగాక. దీర్ఘాయు రనామయము లను ప్రసాదించి శ్రియఃపతి వారికి సకల శ్రేయములను చేకూర్చు గాక అని ప్రార్థించుచు కృతజ్ఞతతో సమాప్తి చేయ చున్నాను.

ఇట్లు

14-8-90 (సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు.

**Prof. S. V. JOGA RAO** VISAKHAPATNAM - 530003.
M. A., Ph. D., Hon., D. Litt, (A. U & U. S. A.)
National Professor of Telugu
U. G. C. Emeritus Fellow
Andhra University
National Sahitya Akademi Awardee.

Date : 16-7-'90

# సహృదయ భూమిక

మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షం రసరహస్యము నెరిగిన వారికి తీర్చిదిద్దిన తోట, ఎరుగని వారికి కుట్రు నట్టడవి. అందులో శబరీ ఖండము అఖండ కవితా శిల్ప సురభిళము. ఆ కవి.త మాట అటుండ ఆ కథా సన్నివేశ పరమార్థము జీవేశ్వరైక్యరహస్యప్రతిపాదనము. ఈ పరమార్థ రహస్యము జగదాద్యుడైన మహాకవి వాల్మీకి మహర్షి మనస్సులో ఉండనే యున్నది. కాని శబరి ఉచ్చిష్ట ఫల సమర్పణ ప్రసక్తి మాత్రము ఆయన రామాయణమున లేనేలేదు. కాని తెలుగు ప్రజలు తెలుగు కవులు ఆ యుచ్చిష్ట ఫల సమర్పణ సన్నివేశమునకు ప్రచారమును కలిగించినారు. అది అమూలకమైనను అవిచారక మూలము కాదు. ఎట్లనగా పండిపోయిన—కాదు—ఎండిపోయిన వరుగు, పరమ తపస్విని, మతంగ మహర్షి ప్రియ శిష్య అయిన శబరి శ్రీరామచంద్రుడు తనను తరింప జేయుటకు వచ్చిన

శ్రీమన్నారాయణుడని గురుముఖతః వినియున్నదయ్యు స్వామికి ఎంగిలి పండు సమర్పించిన దనుటలోనే యున్నది జీవేశ్వరైక్య పరమార్థము బాహిరముగ వ్యక్తమైనది. శబరి గురువు మతంగ మహర్షి అవతారము చాలించినను ఆగురువు గారికైనను పునర్జన్మమున్నది కాని శిష్యురాలైన శబరికి మాత్రము పునర్భవము లేదు. ఇదియొక అపూర్వ సంఘటనము అందుచేతనే ఈ శబరీ వృత్తాంతము రామకథలో ఒక సమున్నత స్థానమును ఆక్రమించుకొన్నది. ఇది బహు భాషల బహు భంగుల రామకథా మధ్యమునను, ఏకదేశము గను ఎందరో సత్కవులచే రసవంతముగ చిత్రింపబడినది.

వాల్మీకమునకు వ్యాఖ్యాన ప్రాయముగ రామాయణ కల్పవృమును రచించిన శ్రీ విశ్వనాథ వారు తమ శబరీ ఖండమున అతిమాత్ర ప్రతిభా సహకృతముగ తీర్చి దిద్దిరి. ప్రాచీన నవీన కాలము నందు ఎందరో కవులు ఈ శబరీ వృత్తాంతమునకు తమ రచలలో ఊపిరి పోసిరి. తత్సాహిత్య మున విశ్వనాథ వారి విశిష్ట స్థానమును నిరూపించు కృషి ఈ చిఱుపొత్తమున సురుచిరముగ సాగినది.

ఏతద్గ్రంథకర్త నాకు ఆత్మీయ ప్రియ శిష్యుడు. కోవిద కోరకము. చి॥ డాక్టర్ శ్రీమత్తిరుమల వెంకట రాజ గోపాలాచార్యులు వచ్చిన ఒక అవకాశమును పురస్కరించు కొని తనకు నచ్చిన ఈ శబరి కథా సన్నివేశమును ఎత్తు

కొని ఒక మహాసభలో నా సమక్షమున ప్రసంగించి నపుడు నలుగురూ పలువురూ మెచ్చినవారు. ఆ మెప్పుదల అతనికి ప్రోద్బలకము కాగా ఈ కృతి నిట్లు అంతర్వాణి వరేణ్యుల అంతరంగమునకు ఆహా పుట్టించునట్లు రూపొందించినాడు.

మనసా వాచా ఇతని కృతిని అభినందించి ఇతోధిక పరిశ్రమోదర్కముగా ఇతని అభ్యుదయము నాకాంక్షించుచున్నాను. అస్తు.

(సం) యస్వీ జోగారావు.



ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
ఎం. ఏ., పి. హెచ్. డి.
సాహిత్య పీఠాధిపతి
తెలుగు విశ్వ విద్యాలయం
రాజమహేంద్రి ప్రాంగణం (ఆం॥ప్ర)

## ఊర్ధ్వ మూలమ్

'విశ్వనాథ శబరి' అని ఈ పుస్తకమునకు పేరు పెట్టుటలో గొప్ప ఔచిత్యమున్నది. ఇది విశ్వనాథ వారు తీర్చిన శబరిని గురించిన వివరణమని ఒక అర్థము. విశ్వనాథ అను శబరి అని మరియొక అన్వయము శబరితో విశ్వనాథకు గల తాదాత్మ్యము ఈ వ్యాసమున నిరూపింపబడినది. ఇదియు శీర్షికతో స్ఫురించు చున్నది శబ్ద సంయోగమున ఇటువంటి వింతలు పుట్టుట కద్దు.

కాని ఇటువంటి వింతలను లోతులను వివరించి చెప్ప నపుడు ముకుత్రాడు వేసి దూరమునకు లాగుచున్నట్లో లోతునకు ముంచు చున్నట్లో అనిపించుట ఒక్కొక్కచోట జరుగుచుండును. వక్త బలప్రదర్శన చేయుచున్నాడేమో అని శంకించుటయు కలదు. కాని అది శ్రోతృజన సామర్థ్యమున బట్టి ఉండును.

విశ్వనాథ భారతి కడు గభీరము దాని ఎత్తును చూచి నంతగా లోతును చూచినవారు అరుదు. మిత్రులు శ్రీ రాజ గోపాలాచార్యులుగారు శబరి ఘట్టమున లోతులు ముట్టిరి. 'శీ త్తే వరే' అని వ్యుత్పత్తిని చెప్పుట, హంసీనవానిల శబ్దముల ఆంతర్యమును తడవుట, శబరీ రాముల సంభాషణము నందలి ఆధ్యాత్మిక తత్త్వమును విశదమరచుట, వైరాగ్య మన్మథ ప్రవేశము నందలి ఔచిత్యమును ఆవిష్కరించుట, ఎంగిలి ఫలము లందించుటలోని సాంకేతికతను లేదా ప్రతీకాత్మతను పట్టి ఇచ్చుట, సంబోధనలలోని లోగుట్టులను తెరచుట,- ఇట్లు ఒకడేమి మొత్తము ఈ ఘట్టము నందు అభివ్యాప్తమై యున్న విశిష్ట యోగ రహస్యముల నెన్నింటినో వీరు శ్రమ పడి సూక్ష్మ దృష్టితో మథించి మనకు అందించిరి. ఈ దధి మథనోత్సవమున వెలువడిన నవనీత మిది.

శబరి పాత్ర "చిత్రము". సంస్కృత కవులెల్లరును వాల్మీకి శబరికి ఇట్టి ఆధ్యాత్మికోన్నతిని కూర్చినవారు కారు. కొందరీమె యోగశక్తిని పరకాయ ప్రవేశాదులకు దించి రాజకీయ ప్రయోజనములను సాధించుటకు కుదించిరి.

"విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్" అన్న ఋషి వాక్కులోని లోవెలుగు ఒక్క విశ్వనాథకే అందినది. రామ కథా భాష్యకారులకు మొగ్గిక్కిన ఫలమిది. ఈ ఘట్టమును

చదివినప్పుడెల్ల విశ్వనాథ వారు వలవల ఏడ్చుట నేనును ఎరుగుదును. దానికి కారణమేమో రాజగోపాలాచార్యుల వారి ఈ వ్యాసము చదివిన పిమ్మట కొంచెము కొంచెము అవగతమగుచున్నది.

అమ్మమ్మా! ఈ చిన్న పుస్తకమున ఎన్నెన్ని లోతులు! ఎంతెంత లోతులు!! వీరు ఇట్లే మొత్తము కల్ప వృక్షమును క్రింది మీదులకు కొలువవలెనని నా ఆకాంక్ష.

సెలవు.

భవదీయుడు,

(సం) బేతవోలు రామబ్రహ్మం



అవధాన సరస్వతి, కవి పంచానన
పేరాల భరత శర్మ
ప్రిన్సిపాల్, ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాల
విజయనగరము.

18-7-90

# అమృత స్పందము

రామ కథకు రసవద్వ్యాఖ్యానము రామాయణ కల్ప వృక్షము. రసము అమృతము. సాహిత్యము ఆలోచనామృతము. ఆ ఆలోచన చేయు వాని శక్తిపై, విజ్ఞానముపై, భావుకతపై ఆయా గ్రంథముల వ్యాఖ్యానములు లోకమున రమణీయములైనవి. అట్టి రమణీయమైన వ్యాఖ్యానము శ్రీమాన్ శ్రీమత్తిరుమల వేంకట రాజగోపాలాచార్యులు గారి 'విశ్వనాథ శబరి'.

శ్రీమాన్ ఆచార్యులవారు ప్రతిపదము నందలి విజ్ఞాన నిధిని వెలికి తీసి వన్నె చూపి విశ్వనాథ ప్రజ్ఞా పాటవమును సోపపత్తికమైన, శాస్త్రీయమైన, సైద్ధాంతికమైన, అధికారిక మైన, ఆనందపరమైన "ద్యులోక దీధితి"తో ప్రకాశింప జేసినారు.

మనము కోరిన ఫలము మన కందించుట కల్పవృక్ష లక్షణము. "మహాభారత పారిజాత" మైనను, "భాగవతాఖ్య కల్పతరువై"నను, "రామాయణ కల్ప వృక్షమై"నను ఇదే లక్షణము కలవి.

ఈ వ్యాఖ్యానమును విశ్వనాథ వారు విన్నచో తన రామాయణ కల్పవృక్ష రచన చరితార్థమైనదని ఆనందాశ్రువులతో పులకాంకురములతో గద్గద స్వరముతో ఆనందించి యుండెడివారు.

కల్పవృక్షము నుండి ఇటువంటి ఫలములు వీరికోరి రామమయమైన జగత్తున శబరి విందు చేయుడని వీరిని అభ్యర్థించుచున్నాను.

(సం) పేరాల భరత శర్మ



# ఆకాంక్ష

ప్రియ సాహితీ సింధువులు డా॥ రాజగోపాలాచార్య రచించిన 'శబరి' వ్యాసం ఆమూలాగ్రం వినే అదృష్టం కలిగింది.

కవి కన్నా విమర్శకుడు గొప్పవాడు. విశ్వనాథ తన శబరి కథలో ఇన్ని ఆధ్యాత్మిక విశేషాలు భావించాడో లేదో కాని ఈ వ్యాస రచయిత భావన చేశారు. ఈ రచయిత పాండిత్య విషయాన మిన్న. వీరు రచించిన అన్న విజ్ఞాన గ్రంథం పఠించిన వారికి, ఏతత్ప్రతిభా పాటవాలు సువిదతాలు.

శబరి గాథ ఆధారంగా ఎన్నెన్నో ఆధ్యాత్మిక రహస్యాలు వెలువరించారు రచయిత. ఈయనకు ఉపనిషత్తులు కరస్థ బదరీ ఫలాలు. ఈ పుస్తకం చదవటం ప్రారంభిస్తేచాలు పాఠకునిచే ఆసాంతం చదివిస్తుంది. ఊరక చదివి విడిచి పెట్ట దగిన గ్రంథం కాదిది. ఆలోచనామృతానికిది ప్రతీక.

ఈ రచయిత మేధా సరోవరం నుండి, ఎన్నో సాహితీ సరోజాలు వికసించాలని, ఆధ్యాత్మిక సౌరభాలు గుబాళించాలని, మనసారా ఆకాంక్షిస్తూ-

రేపల్లె
18-7-90

(సం) మొవ్వ వృషాద్రి పతి
ఆంధ్రోపన్యాసకుడు-రేపల్లె.

ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్
కోగంటి సీతారామాచార్యులు

A. T. అగ్రహారం
6వ లైను
గుంటూరు_4

# సమానానాం ఉత్తమ శ్లోకోఽస్తు

ఈ 'విశ్వనాథ శబరి' అనే వ్యాసం రామానుగ్రహంతో గ్రంథ రూపాన్ని ధరించింది. శ్రీ విశ్వనాథ వారు తమ కాత్మీయులైన వారు వచ్చి మీ రామాయణము నుండి ఏదయినా వినిపించమని కోరినప్పుడు వారు ఆనంద పారవశ్యంతో వినిపించే ఘట్టాలలో ఇది ఒకటి. మరి కల్ప వృక్ష చ్ఛాయల్లో శబరీ శ్రీరాముల సంభాషణం వేరుగా కన్పిస్తుంది. ఇందులో ఉన్న అంతరార్థం ఏమిటో తెలుసు కోవటం కష్టం. అలాంటి శబరీ ఘట్టాన్ని ఈ రాజగోపాలా చార్యుల వారు మెల్ల మెల్లగ పసికట్టి పసిగట్టి వారి నాన్న గారి శిక్షణ చేత తాత్త్వికమైన దృష్టి విశేషం కలవారగుట చేత అనేక విధములైన ప్రమాణాలతో మంచి వ్యాఖ్యానం చేశారు.

"కీ॥ శే॥ విశ్వనాథ సత్యనారాయణగారు వాల్మీకాన్ని చక్కగా అనువదించారు" అని వారి అభిమాన పాత్రులైనవారు అంటుండగా నేను విన్నాను సత్యనారాయణ గారు ఎన్నడు

అనువాదం చెయ్యరు. ఆ బుద్ధిజాతి అట్టిది కాదు. సంస్కృతంలో వాల్మీకం వలె తెలుగులో కూడ స్వతంత్రంగా రామాయణం ఉండాలని వీరు వ్రాసారు. రామాయణ-కల్ప వృక్షములకు రెండింటికి అభేదాన్ని కల్పించి ఆ పేరు పెట్టారు. ఈ రామకథ రామాయణ మహానదిని అనుసరించ లేదు. తన ఇష్ట ప్రకారం ఎన్నెన్నో గ్రంథాంతర కథా వాహినులను తనల్లో ఇముడ్చుకొనినది. ఈ శబరీ ఘట్టాన్ని ఇలా చిత్రీకరించటంలో ఆనందాది రామాయణములలో ఎక్కడయినా సూచన ఉన్నదేమో! కేవలం వాల్మీకాన్నే పట్టుకొని ఉన్నవాళ్ళకు వీరి కల్పనలు కొన్ని నచ్చక పోవచ్చు.

ఇలాంటి విచిత్రానుపపత్తులతో కూడిన ఈ శబరీ ఘట్టాన్ని ఈ రాజగోపాలాచార్యుల వారు శ్రమించి వివరించారు. బహు నిమంటు పర్యవేక్షణ ప్రతి శబ్దము నందును తత్త్వార్థ సమన్వయం చేసే అభ్యాసం గల కుటుంబంలో జన్మించటం, అంతరార్థములను అన్వేషించటం, వీరి తండ్రి గారి వద్ద నుండి వచ్చిన విద్య అయినందు వలన, ఇప్పుడు ఇదీ క్రొత్తగానే సహృదయుల నానంద పరుస్తుంది.

వీరి పితృదేవులతో భారత తత్త్వాన్ని గురించిన గోష్ఠి నేను చాలా కాలం క్రితం చేశాను. అందులో మాకు అభిప్రాయ భేదాలు వచ్చి కొంత సేపు వాదం చేసాము.

అనారోగ్యంతో బాధపడుతున్న శ్రీ ఆచార్యుల వారు "నా మాట యిప్పుడు మీకు నచ్చకపోయినా, భవిష్యత్తులో ఎప్పటికయినా నచ్చుతుంది. అప్పుడు వారి మాటే నిజం అనుకుంటారు" అని అన్నారు. ఆ మాట నిజంగానే నిజమైంది. ఆ తండ్రి బిడ్డ కనుక ఈ తాత్త్వక కిశోరం అనన్వితములుగా కన్పించే వాటిని సమన్వితంగా వ్యాఖ్యానిస్తున్నారు. నాకు చాలా సంతోషంగా ఉంది.

మహర్షుల యోగ లక్షణాలు వేరు వేరుగా నున్నట్లు మనకు తోచినా, అది ప్రకార భేదమే కాని, ప్రకారియైన యోగానుభవంలో తేడా ఉండనట్లే రసమార్గము నందు ప్రయాణించే కవుల కావ్యానందానికి యోగానందానికి అట్టే తేడా ఉండదని నా అభిప్రాయం.

ఈ గ్రంథకర్త ఈ రెండు మార్గాలలో ఉండే అందచందాలు సమీక్షింప గలవాడని ఆనందిస్తున్నాను. గ్రంథ విషయం చాలా గొప్పది. ఈ రాజగోపాలాచార్యులు గారు సమానానాం ఉత్తమ శ్లోకో అస్తు.

గుంటూరు (సం) కోగంటి సీతారామాచార్య



